# అభినవసరస్వతి

సంపుటము 5. | జానపాడు ప్రమాదీచ సం॥ శ్రావణమాసము. | సంచిక 8.

## విద్వన్మహాసభాపరిష్కారము.

———○O○———

శ్రీమన్మహీమండల మండనాయమానంబగు నీభరతఖండంబునఁగల యకారణ కరుణచే దయామయుఁడగు పరమేశ్వరుఁడు సర్వకర్మమూలంబగు శ్రుతినిచయంబును దయచేసియుండుటయు, నాశ్రుతులయందుఁ బ్రతిపాదింపఁబడిన విషయములు మందబుద్ధులకు గోచరములుగావను తలంపున మహర్షులచే స్మృతిరూపంబున బోధింపఁబడుటయు, తత్తచ్ఛ్రౌతస్మార్తాదికర్మములనే యీభరతఖండ నివాసులగు మహనీయులు పూర్వులు సంప్రదాయక్రమముగా నాచరించుచు నుచ్ఛ్రితియందుండుటయు నందఱకు విశదమే, కలికాలమహిమచేఁ గర్మధర్మంబులు బొత్తిగా నశించుచుండుటను గన్నులారఁ జూచుచున్న మహనీయులందఱు నీకర్మములవిషయమునఁ దమకు సహాయులయిన ప్రభులు లేమిం జేసి విచారపడుచుండుటచే నీమహాత్ములగు పూర్ణయశస్కులవారలే యుపాయములచే స్వస్వధర్మములు తేఁటపడి యాకర్మధర్మముల నాచరించుటచే లోకులిహపరలోకములయందు సుఖపడుదురని యాలోచించి దేశమునక్కడక్కడఁ బండితులు స్సంఘముగాఁ జేరి ధర్మములయందలి సందేహములను బరస్పరము చర్చించి నిర్ణయించుకొని జనులకు వెల్లడిచేయుచుండినఁ గ్రమక్రమముగా ధర్మమెట్లు పాదుకొనక పోవునని తలంచియు నట్టిమహాకార్యమునకు మార్గదర్శకులు కావలసినదని యనేకులను బండితుల నుత్సాహపఱచియు, నామహాకార్యము ధనమూలముననే సాధ్యమగుటచేతనో మఱియేకారణముచేతనో యుపేక్షతో నున్న పండితబృందము నుత్సాహపఱచుచు స్వగ్రామవాసులు దేశవాసులునగు కొందఱు మహామహులసహాయంబునఁ దామే యీమహాకార్యమునకు మార్గదర్శకులగుటకును, అందుల మహావ్యయ ప్రయాసముల సహించుటకును సాహసించిరి. ధనసహాయము లేకున్నను బాండిత్యసహాయము పూర్ణముగాఁగల మహాశయులుగూడ నుపేక్షించినచో సుఖపడనేరదుగదా. పండితుల నిట్టియుపకారము చేయుటకే పరమేశ్వరుఁడు సృజించెఁగదా ? కావున, శ్లో॥ అసాధనావిత్తహీనా బుద్ధిమంతస్సుహృత్తమాః। సాధయంత్యాశుకార్యాణి కాకకూర్మమృగాఖువత్॥ అన్నట్లు వీరిచేఁ గార్యము నిర్వహింపఁబడెను.

ఈ మహాసభకు నగ్రాసనాధిపతిగా నుండుఁడని బ్రహ్మశ్రీ వారణాసి వేంకటశాస్త్రులవారిని బ్రార్థించిరి- పండితశిఖామణులగు వారును నట్టియాధిపత్యమును వహించి సభా కార్యముల నిర్వహించెదమని యంగీకరించిరి- తరువాత నమ్మహాసభయందు మొదటిదినమున బ్రాహ్మణులకు దేవాలయాదులయందుఁ ద్రిరాత్రదీక్షావిరహితమైన యుపనయనమును, చతూరాత్రదీక్షావిరహితమైన వివాహమును, చేయుటనింద్యమను నంశమున బ్రా|| శ్రీ కూనపులి పూర్ణయశాస్త్రులవారు "త్రిరాత్రముభయోరధశ్శయ్యా, బ్రహ్మచర్యం, క్షారలవణవర్జనంచ, తయోశ్శయ్యామంతరేణ దండో గంధలిప్తో వాససా సూత్రేణ వాపరివీతస్తిష్ఠతి-తంచతుర్థ్యామపరరాత్ర ఉత్తరాభ్యాముత్థాప్య ప్రక్షాళ్య నిధాయాగ్నేరుపసమాధానాద్యాజ్యభాగాంతే ౭ న్వారభ్యాయాముత్తరా ఆహుతీర్హుత్వా జయాది ప్రతిపద్యతే" అని యాపస్తంబ గృహ్యసూత్రమును బ్రమాణముగాఁ జెప్పి ధ్రువారుంధతీదర్శనానంతరమునందే చేయఁదగిన స్థాలీపాకము నిట్లిష్టమువచ్చినప్పుడు చేయుటదగదనియు, ఆశ్వలాయన గృహ్యసూత్రమునఁ గూడ "అతఊర్ధ్వమక్షారలవణాశినౌ బ్రహ్మచారిణావలంకుర్వాణౌ వధశ్శాయినౌ స్యాతాం త్రిరాత్రం సంవత్సరంవా" అనియు, "వివాహచతుర్థ్యాంరాత్రౌ కేచిద్ధోమమిచ్ఛంతి" అనియు వివాహదీక్షావిధి యున్నదనియు, ఆపస్తంబగృహ్యసూత్రమునందే యుపనయనవిషయమున "త్ర్యహమేతమగ్నిం ధారయంతి క్షారలవణవర్జనంచ। పరిత్యేతి। పరిమృజ్యతస్మిన్నుత్తరైర్మంత్రైస్స విధ ఆదధ్యాత్" అనియును, ఆశ్వలాయన గృహ్యసూత్రమునఁ గూడ "అతఊర్ధ్వమక్షారలవణాశీ బ్రహ్మచార్యధశ్శాయీ త్రిరాత్రంసంవత్సరం చరిత్రవతాయ మేధాజననంకరోతి" అనియున్నదనియు, నుపన్యసించిరి- అంత బ్రహ్మశ్రీ- విష్ణుభట్ల పూర్ణయ్యశాస్త్రులవారు ఆచరించువారందఱును శిష్టులుగారనిగాని యీ యాచారము ప్రమాణము కాదనిగాని చెప్పసాహసించువారుండరుకదా- ఈసద్యోదీక్ష యెక్కడనైననుగలదా? అంధపరంపరగా నాచరింపఁబడుచున్నదా? యని ప్రశ్నచేసిరి అప్పుడు కూనపులి పూర్ణయశాస్త్రులవారు అభినవ షడశీతివ్యాఖ్యలోను స్మృతిరత్న మహోదధిలోను "ప్రధానహోమాదారభ్య శేషహోమమధ్యే దంపత్యోరన్యతరస్య మరణే తదానీమేవ శేషహోమాంతంసర్వంకర్మకృత్వా సంస్కారం కుర్యాత్" అనువాక్యమును జూపి వివాహాదికార్య మధ్యమందు దంపతులలో నెవరికైన మరణము సంభవించినప్పుడు చేయఁదగిన భవిష్యత్తంత్ర పరిసమాప్తిని జూచి కలిజనితమాంద్యాదిదోషము కలుగుటచేత ద్రవ్యలోపమందుఁ గూడ భవిష్యత్తంత్రపరిసమాప్తిని జేయవచ్చునని తలఁచిన సాహసికుల యాచారమే

యీయంధపరంపరను మూలమునియును నది॥ శ్లో॥ గురోరప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః॥ ఉత్పథంప్రతిపన్నస్య పరిత్యాగోవిధీయతే॥ అనునభియుక్తోక్తివలనఁ దిరస్కార్యమనియుఁజెప్పిరి సభ్యులును అగ్రాసనాధిపతియును నీవాదమును సాధువాదముతో నంగీకరించిరి ఆదినమునకు సభముగిసెను

(మహామహాప్రార్థన)

లోకోపకారకరణే, బద్ధశ్రద్ధాభవంతు విద్వాంసః।
సూచయితుమితివిలిఖతి। శ్రీప్రౌఢసరస్వతీ ద్విజః కోఽపి॥
అద్యశ్వోఽవద్య సంస్కృత్యభినవ విభవప్రాభవావి ప్రవాచ్యా।
హాణీవాణీధురీణాః కతిచన విమతవ్రాత్యకృత్య ప్రవృత్త్యా।
వర్తంతేఽమీ బహుత్రశ్రుతిపథగళితా,నైవతాన్ ప్రార్థయామో।
సంస్కర్తుంవా కథంచిత్ప్రకృతకృతిహితే పండితాన్ క్లిష్టశిష్టాన్॥
అత్రమోకశ్చనస్వార్థో। లిఖనేమేసుఖాయవై।
సతాంప్రీత్యైచవిద్వాంసో। గురవస్సంమృశంతుభోః॥

సద్విద్వద్ద్విజగురువర్యులారా! లోకోపకార కార్యధుర్యులారా!! నేఁడు రేపుఁ గలికాలబలము హెంటె నిటనట బ్రహ్మ-ర్య-తత్త్వజ్ఞాన (Theosophical society) సామాజికులగు నింగ్లీషుమత సంఘసంస్కరణ బ్రాహ్మణబ్రువుల యకాండ ధమోద్యోగ పీఘుమత్తఘున తాండవాడంబరంబుఁ బామరతఁ గాంక్షించిత నగయఁ బోయి మనవారిలోఁగొందఱు నీక్రింద నుదాహరింపఁ బడినవారు పరమాజ్ఞానమున నయ్యైవేష భాషలనటించుచుఁ బులినిఁజూచి నక్కవాతఁబెట్టుకొనినరీతిని నీతిని మఱచి విచారమూఢులై కామచారనిరూఢులై కృత్యాకృత్యములఁ బాటింపక విశేష ధనధాన్య వ్యయముల దేశాంతరజాత్యంతర నీత్యంతరకన్యకల నజ్ఞాతకులశీలల వివాహ మాడి జాతిభ్రష్టతను వెఱచి పశ్చాత్తాపపడుచు భవత్సభాను జిఘృక్షులగుచుఁ బూరిఁ గఱచుచున్నారు యద్యపి,వీరు కామముతో నిట్టిదుష్కృత్యముల మొట్టమొదట నాచరించినను బైసామాజికులవలె హాతత్త్వశతత్త్వములూనక మహానుగ్రహ ప్రసాదము నాత్యంతికముగ నిరీక్షించుచు నాపన్నులైయున్నారు ఇట్టివారి ననుగ్రహించుటకుఁ బ్రాయశ్చిత్తశాస్త్రము పావకాళమనుటఁ దమరెఱుఁగని విషయముకాదు. అగ్రహానిగ్రహానుగ్రహములు సద్విద్వద్ధర్మములు, వీరైనను విధవా ఋతుమతీవివాహవాదులవలె వివదమానులై యిట్టికార్యము లొనర్చినవారు కారని వారి నయవినయాభినయ ప్రవృత్తు

లే స్పష్టపఱచుచున్నవి కావున బ్రాహ్మాదిక కామకృత్యముల దూషితులగు నీక్రింది బ్రాహ్మణుల ననుగ్రహించి యుక్త ప్రాయశ్చిత్తాదుల సంగ్రహించి వీరిని గ్రహించు సదుద్యమమును శీఘ్రముగఁ బూనుఁడు సద్విద్వద్ద్విజ గురువరులకసాధ్యమగు వర్ణాశ్రమాచారదోషములు ప్రాయికముగ మృగ్యములుగద? కామచారదోషమునైనను నివర్తింప,

“ కామకారకృతేఽప్యాహు, రేకేశ్రుతినిబంధనాత్॥”

,, కామకారకృతంత్వేవం। మహాపాపంద్విధాస్మృతం।

“ పురుషాపేక్షయాచైవ। నిష్కృతిర్ద్విధాస్మృతా॥”

శ్రుతిశ్చ॥” ఇంద్రోయతీన్ శాలావృకేభ్యః ప్రాయచ్ఛత్తమశ్లీలావాగభ్యవదత్స ప్రజాపతిముపధావత్తస్మై ఇంద్రాయోపహవ్యం ప్రాయచ్ఛత్॥”

,, ఆర్తానాంమార్గమాణానాం। ప్రాయశ్చిత్తానియేద్విజాః।

,,జానంతోనప్రయచ్ఛంతి। తేఽపితద్దోషభాగినః” ఇత్యాదిగ, ననేకశాస్త్రములు ఘోషించుచు మహాజన పరిగ్రహము నన్వేషించుచున్నవి కావున సాధ్యములగు జ్ఞానాజ్ఞానదోషముల నిర్మూలన పఱుపఁ దమవంటి సత్పురుషులు దగుదురు గాన వీరికిఁ దగుప్రాయశ్చిత్తము ననుగ్రహించి లోకోపకారపారీణత వహించ సమస్త సద్విద్వద్ద్విజ గురువర్యులు సష్టాంగ ప్రణామ పురస్సరముగఁ బ్రార్థింపఁబడుచున్నారు ఈదోషదుష్టలుగ్రాజ్ఞాతకులశీలకన్యకలఁ దక్షణమే పరిత్యజించి యున్నారు సుండీ!!! ——— వివాహము లైనను విధి పురస్సరముగ జరిగియుండలేదఁట గావున యోగ్యములును గావు. యుక్తప్రాయశ్చిత్తానుగ్రహము నిచ్చిన ధర్మశాస్త్ర విధిననుష్ఠింపఁగలము

(1) నందికోటుకూరుతాలూకా పగిడేల- కవి బొమ్మకంటి వెంకటాచలయ్య
(2) ,, ,, ,, ఈవారి మేనల్లుఁడు రామచంద్రుఁడు
(3) కోవెలకుంట్ల తాలూకా హరివరం పుల్లావధానులు

మఱియుఁ గొందఱుందురుగాని వారి ప్రపత్తి కనుపడనికతనఁ బ్రకృతమిటఁ గనుపఱచవలసిన యావశ్యకముండదు

ప్రత్యుత్తరరూపానుగ్రహపత్రిక- రాయచూరుజిల్లా శ్రీజోగుళాంబా అలంపూరుగ్రామధర్మకర్మబ్రహ్మ సభవారిపేర రావలయును

శ్రీ దేవస్థానము, అలంపురీ,
ప్రమాదీచ శ్రావణ శు ౧
భానువాసరము

ఇతినతితతిః
శ్రీకుమారస్వామిశాస్త్రిణః
ప్రేషసరస్వత్యాః.

# శ ల భా ల భ న మ్.

శ్లో॥ ఆకారాలమ్బనా న్నైవ కరభ శ్శరభాయతే
కళాదేశా త్తథా త్వేఽపి, గలాభేదా ద్రభోలభః ॥౧॥

అథ శలభాలభనం వ్యాఖ్యాస్యామః, రామరాయ శ్రీరామ శర్మాణం బార్గవగోపనామకం మధ్యే కృత్య 'పశ్యశబ్దమీమాంసేతి, పంచాననపలాయనమితి, గుంజాగర్వభంజనమితిచ లిఖిత్వా ప్రకటీచ కార, తత్ర మీమాంసానామ పిష్టపేషణాత్ గతార్థా, ఇదానీ మవ శిష్టం వ్యాసద్వితయం సంక్షేపతో విచారయామః, పలాయనేతావ త్సమస్యాపూర్తిం ప్రథమతః కిమప్యస్మత్పూరితామే వాఽనుకుర్వన్విర చ్య తదన్వయేనచ పథాకాశికామతానుసరణమితి పశ్య మాపశ్యంకృ త్వా పూరయతి రామరాయః, తదిదం లాక్షణికమతవిరుద్ధ మితి నిర స్యతే సంక్షేపతః—అత్రచ వచనాని.

(1) శ్లో॥ శక్త మప్యర్థ మాఖ్యాతుం య న్న సర్వత్ర సమ్మతం అసమ్మతం . . " ప్రపూర్వః స్మృధాతు ర్విస్మరణార్థఏవ ప్రసిద్ధో నతు ప్రకృష్టస్మరణార్థే, తథాచోక్తం నైషధకావ్యే"

శ్లో॥ నాఽక్షరాణిపఠతా కిమపాఠి ప్రస్మృతః కిమథవా పఠితోఽపి,
.... ఏవంకవిసమ్మతమేవ పదం ప్రయోజ్యం కావ్యే, నాఽన్యత్ "
(వాగ్భటాలంకారః)

(2) " .అత్ర దధదిత్యర్థే, విదధగిత్యవాచకం, విపూర్వోహి దధాతిః కరోత్యర్థే వర్తతే, యదాహ, ఉపసర్గేణ ధాత్వర్థో బలా దన్యత్ర నీయతే" (కావ్యానుశాసనమ్)

సంత్యనేకాన్యప్రామాణికవచనాని, అతఃప్రకృతే, దృశిధాతోః క్వచి త్ప్రసిద్ధ మాఙ్పూర్వకత్వ మితి న సర్వత్ర తదంగీక్రియతే, ఆదర్శి తేత్యాకారకవిశేషణేచ, ఆదర్శఇతిఆదృష్టిరిత్యపివిశేష్యేచ॥శ్రూయత ఆఙ్పూర్వకత్వమ్, నత్వన్యత్రేతి, పశ్యమాపశ్యం కర్తుంవా, ద్రష్టార మాద్రష్టారం కర్తుంవా, న కస్యాఽప్యధికారః, తథాపి యది కరోతి

యథేచ్ఛం నత్ర దంగీకుర్వంతి లాక్షణికాఇతి స్పష్టమేవ, అపిచాఽయం నియమో నహి ధాతూపసర్గయోరేవ, కింత్వన్యత్రాఽపి—తథాచాఽలంకారశేఖరే—

"స్వభావవైచిత్ర్యజుషామ్" విచిత్రస్వభావానిఖలు పదాని భవన్తి వామనయనా, వామోరు రితి భవతి, నతు వామపదనా వామపాణిరితి, అత ఉక్తం స్వభావేతి"

విస్తరస్తు తత్తద్గ్రంథేభ్య ఏవావగన్తవ్యః, అత ఆపశ్యాశ్రయణం నహృదయంగమం, అతఏవాఽస్మాభి శ్నేదం స్వీకృతం, నచేదం దురూహం, గత్యంతరాభావే సర్వత్ర వ్యాఖ్యాతార స్త్విదమేవ సమాశ్రయంతీతి జానాతిరఘువంశచతుర్థసర్గమాత్రపార్యపి కలార్థీ, కిమర్థ మగతికగతికాంసరణి మాశ్రిత్య పూరణీయా సమస్యా, తగపేక్షయా దుష్టేతి కథనమేవ శతగుణం వర మితి జానతే సహృదయాః శ్లో॥ "ప్రక్షాళనాద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరమ్,, యది తాదృశమపి కవిత్వం, తర్హీదంచ భవేత్,

యథా, "పుంసివాకొమ్మొకి, ఇత్యపులు గూయఁగా, కోనం గుఁడేయఁగా అప్పేక దంతుంఘ, ఆడఁ దోడఁగె"

ఏతాదృశమార్గానుయాయీ రచయితా న కవిః, కింతు—"హారా దాకృష్టానాం కతిపయపదానాం రచయితా జనః, అత స్తాదృశం పూరిణం యైః కైరపి పూర్యతాన్నామ, నరామరాయ స్యోచిత మితి లాక్షణికానురోధేనోపదిశామః— అపిచాఽఽపశ్యఇతి పదచ్ఛేదే, మాండూక్యోపనిషద్భాష్యాదికం కౌముదీచ, విరుద్ధ్యేతామిత్యపి వక్తుం శక్యతే, తథాఽపి కిమర్థం శాఖాచంక్రమణేనేతి లాక్షణికవిరోధ ప్రదర్శనమాత్రతో నిరస్త మితి విదాంకుర్వన్తు సన్తః, అపిచైతాదృశం శ్వపుచ్ఛసదృశం కించి దవలంబ్య కిమప్యహృదయంగమం పూరయ న్నస్మత్కృతాం పూర్తి మప్యాక్షిపతి రామరాయః, ఆక్షిప్య చ, పునరంగీకరోతి సమస్యాపూర్తిం, కిం త్వస్మత్కృతాం టిప్పణి మంతతో గత్వా నాఽనుమన్యతే,వస్తుతస్తు పూర్తిశ్చ తత్సంబంధినీ టిప్పణిశ్చ నిర్దుష్టే, తథాఽప్యయం కి మప్యస్మాకం స్వసదృశత్వసంపాదనా

ర్థం యతతే, త దేత దస్య సహృదయతాదౌర్భాగ్య మూలక మితితు సత్యమ్, తదేత ద్విచార్యతే— యద్యయం సహృదయః, తదాత్వసే న కిముప్యుక్తం సమ్మాన్యం భవతి—అన్యథా బాలకజల్పవ న్నిరస్య మేవ, అతో ఽస్య 'గుంజాగర్వభంజన,ప్రసంగాత్సహృదయతాదౌర్భా గ్యం తావ త్ని ర్ణీయతే—తద్ధి "భంజనం" స్వకృతాపరాధసదృశీం శ్రీకృష్ణలీలా తరంగిణీ ముద్ధర్తు మారబ్ధా, దత్తానిచ బహూ న్యుదా హరణాని, తేషుచ బహూని స్వకృతాపరాధస్య న కేవలం సంబంధీని, తాసీమాని—శ్లో॥ యఃపణ్యాస్త్రీరతి పరిమళోద్గారిభి ర్నాగరాణామ్ శ్లో॥ సంభోగా న్తే మమ సముచితో హ స్తసంవాహ నానామిత్యాదీని- నిఘంటు మప్యుదాజహార, కౌముదీంచోదాజహార, ధర్మశాస్త్రంచ, వేదంచ, వైద్యశాస్త్రంచోదాజహార, తదేతజ్జ్ఞాన లవదుర్విదగ్ధత్వ ప్రక టనమాత్రమ్, త త్త్వకథనతత్పరం తదేత త్సర్వమపి నాఽస్య కించి దుపకరోతి, అపిచ మృదుపదగుంఫిత మాంధ్రభాగవతమపి స్వకృతాప రాధ మపనుదతీతి తస్మాచ్ఛ కానిచి త్పద్యాని లీలావర్ణనఘట్టా దుద్ధృ త్యోదాహృతాని, తేషాం చాఽస్యలీలావర్ణనస్యచ నకోఽపి సంబం ధః, రామరాయ ఏవ మవర్ణయ త్కృష్ణలీలాః—

శ్లో॥ స్వపదాఽఽత్మమాతృవివృతాఽఽననాఽ న్తరే సమమూ త్రయత్ "

కాచన గోపీ యశోదాం ప్రత్యేవంవక్తి, భవత్పుత్ర స్తావ దస్మన్మాతృవక్త్రే సమమూత్రయ దితి—నకుత్రాఽపి భాగవత ఏతా దృశ మవాచ్యవర్ణనం పోతరాజో ఽకల్పయత్—నాఽ స్తి మూల గ్రంథేపి—తత్రతు—

శ్లో॥ ఏవం ధార్ష్ట్యా న్యుశతి కురు తే మేహనాదీని"

ఏతావన్మాత్రమ స్తి, వ్యాఖ్యాయాం, ఏవంధార్ష్ట్యాదీని కురుతే, తథా స్వర్చితే గృహే మూత్రపురీషోత్సర్గాదీని కృత్వా త్వత్సమీపం సాధు రివా స్తే॥

శిశుత్వా ద్ధేతో ర్గృహే మూత్రపురీషోత్సర్గం కరోతునామ, వద

నేషు తథా కరోతీతి కల్పనం కీదృశమ్, తత్సారస్యం రామరాయఏవ జానాతి, పోతరాజస్తు మూలాపేక్షయా కించి దధికం కల్పయన్నప్యేవం న కించి దప్యశ్లీల మూచివాన్—అయంతు సర్వత్ర "భగ శిశ్న వృషణ మైథున మలమూత్ర ప్రముఖపదాని యథేచ్ఛం ప్రయుంజానః కస్యాశ్చి న్ముఖే శ్రీకృష్ణభగవాన్ మూత్రయామాస, కస్యాశ్చి చ్ఛిరసిచ తథా కృతవాన్ కస్యాశ్చి దంగం స్వపురీషేణ లిప్తవాన్, ఇత్యేవ మశ్లీలాన్యవర్ణయత్, అతోఽ స్య పోతరాజకల్పనం నాఽలంబనమ్, ద్వివిధ మస్య కవిత్వే దూషణం, వర్ణ్యంచ దూష్యం, తత్రోపయుక్తాని పదానిచ దూష్యాణి, వర్ణ్యం తత్త్వకథన పరత్వేన నైవదుష్యతీత్యయం కిమపి వక్తి, తన్న, రామరాయకల్పిత మూత్రప్రక్షేపణ మలావలేపాదికం న తత్త్వ కథనం, గోపీవక్త్రేష్వయ మమూత్రయదితి న కుత్రాఽప్యస్తి భాగవతే, నాఽపి మల మలిమ్ప దంగేష్విత్యపి అత స్సర్వథా నింద్యగ్రామ్య మిదమ్, నచైతత్కృత జఘన్య కల్పనస్య నింద్యగ్రామ్యపద మపి స్వరసతో వాచకమ్, తథాఽపి సదృశ సంజ్ఞాభావాత్తేనైవ వ్యవహ్రియతఇతి వేదితవ్యమ్, అథ యదీదం జఘన్య వర్ణనం తత్త్వకథనమపి న కావ్యే ప్రశంసనీయం, తథాచ ధ్వన్యాలోకే-

"కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతన్త్రేణ భవితవ్యమ్, తత్రేతి వృత్తే యది రసాననుగుణాంస్థితిం పశ్యేత్తాం భంక్త్వాఽపి స్వతంత్రతయా రసానుగుణం కథాన్తర ముత్పాదయేత్, నహి కవే రితివృత్తమాత్ర నిర్వహణేన కించిత్ప్రయోజనమ్, ఇతిహాసాదేవ తత్సిద్ధేః"

అత స్స్పష్టం రామరాయకృత మల మూత్ర ప్రసంగాదికం తత్త్వకథనమపి దూరతః పరిత్యాజ్యమితి, తుష్యతు దుర్జనన్యాయేనైతత్ప్రసంగస్య తత్త్వకథనపరత్వ మంగీకృత్య ధ్వన్యాలోక ఉదాహృతః, వస్తుతస్తు నేదం తత్త్వకథనం, కేవలగ్రామ్యస్య కవే రనుభూతిరిత్యపి వక్తుం నపారయామః, కింతు బహుజన్మకృత విపరీత పుణ్యపరిపాకవశాదేతాదృశ వర్ణనాయ ప్రవృత్తోఽస్య ధిషణేతి వక్తుం న కశ్చి త్సంశయ ఇతిదిక్, వర్ణ్యవిషయకం దూషణం సంగ్రహతో నిరూపితమ్, అథోపయుక్త 'భగశిశ్నాది పదవిషయకం దూషణం వివిచ్యతే, ఏతత్సమర్థ

నాయాఽనేన బహుధా ప్రయతిత మితి పూర్వై ర్వ్యోక్తమ్, తత్ర భర్తృహరిసుభాషితాదపి కించి ల్లక్ష్య మదాత్ "స్థూలోపస్థస్థలీష్వితి, తదిదం లక్ష్యం, శ్లో॥ సంసారే స్వప్నసారే పరిణతితరళే" ఇతి శ్లోకగతం, అతశ్శాంతోక్తి గతత్వాదేతదశ్లీలం లాక్షణిక సమయానుకూలమేవ—తథాచ, కావ్యాను శాసనమ్—

"శాంతవిదూషకాద్యుక్తౌ న దోషః" ఇతి— విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః అనేనైవ భర్తృహరి సుభాషితస్థా న్యన్యాన్యపి నిర్దుష్టానీతి విదాంకుర్వన్తు సంతః యథా, శ్లో॥ స్తనౌ మాంసగ్రన్థీ. ... గురుకృతమ్' యథావా, శ్లో॥ కృచ్ఛ్రేణాఽమేధ్యమధ్యే—" నహి రామరాయ కృత భగశిశ్నాది పదప్రయోగ శ్శాంతోక్తి ష్వంతః పతేత్ కింతు లీలావర్ణన పరత్త్రి ఇతి సర్వథా దుష్టఏవ, అపిచ ప్రహసనాదపి లక్ష్య ముదాహృతమ్ తచ్చ తరంగిణీం నోద్ధరతి, హాస్యోక్తి ష్వశ్లీలస్య సమ్మతిం దర్శయతి కావ్యాను శాసనం, నతు లీలావర్ణనం హాస్యమ్, అతస్సర్వథా నిర్మూలం నిరుపయుక్తం హేయం నిరస్యం లజ్జావహం పాపావహంచేదం వర్ణన మితి సూపపాదం, యదపి రామరాయః "నివృత్త తర్షై రిత్యుదాహృత్య" కఉత్తమ శ్లోకగుణాను వాదాదిత్యాద్యపలపతి, తత్తుచ్ఛప్రయోజనమ్, యదీయం మలమూత్రప్రసంగ పరంపరా హేయగుణరహిత భగవద్గుణేషు విద్యేత తదా తదనువాదస్తావ న్ముక్తిప్రద స్స్యాత్, తద్విముఖానా మస్మాదృశాం పాతకంచ స్యా న్నామ, కేవలం మహానుభావే శ్రీకృష్ణే కల్పితం గ్రామ్యస్యక వేరనుభవం నిషిద్ధ్యతా మస్మాకం కథం పాప మాపతేత్, ప్రత్యుతైతాదృక్కళంక స్యోద్ధరణా దస్మాకం పుణ్యమేవ స్యాదితి తత్త్వమ్, శ్రీకృష్ణకృతగోపీవస్త్రాపహార జలక్రీడా రాసక్రీడాదికం సర్వం శిరసా ధారయ స్త్వేవ సన్తః, తత్ర నకాఽపి శంకా, కింత్వయం గోపీ స్త్రీషు మూత్రయతీతి నకుత్ర శ్రుతం, నాఽపి చ స్మృతమ్, కథ మిదం విశ్వస్యతామ్, కథంచ పఠ్యతామ్, కథంవా పాఠ్యతామ్, ఏతాదృశ మవలక్షణం కిమపి కవిత్వం రచయం స్తత్సమర్థనాయాఽయమనసుగుణాశిలష్యాణ్యుదాహరన్నంతతో గత్వా తాన్యపినాఽ లంభ వేయురాత్మానము

ద్ధర్తు మిత్యాశంకమాన ఏవం వదతి

"వస్తుతస్తు గ్రామ్యకథాసు భగశిశ్నాదిపదప్రయోగా అశ్లీలా అపి భగవత్కథాసు తే నాశ్లీలాః"

కే నేద మంగీక్రియతామ్, భగవత్కథాస్వేవ పరమపవిత్రాణి పదాని వ్యవహర్తవ్యాని, భగవదారాధనాయ కరచరణాద్యవయవా పేక్షయా వరాంగాద్యవయవాని గుహ్యాన్యుపకుర్యు ర్విశేషత ఇతి న కించిదప్యనుశాసన మస్తి, అతఇదం వృథాగర్జనం, అస్మృతవాదవశా దితః పురాకృతనికృష్టతరవర్ణనా దార్జితం పాతకం పునశ్శతగుణం భవేదిత్యపి వక్తుం శక్యత ఇత్యల మనుపయుక్తప్రసంగఖండనపారతన్త్ర్యేణ, అపిచాన్తతో గత్వా చైవం నృత్యతి—

"భోజనాః పంచాననీయా నశ్లీలశ్రవణానందాదిగ్రంథా న్పఠిత్వా నరకం మాయాత, శ్రీకృష్ణలీలాః పఠిత్వా శ్రుత్వాచ స్వర్గం యాత,,

ఏవంవృథానర్తతోఽస్య కీదృశం జ్ఞాన మితి నపారయామో నిర్ణేతుం, కింతు - భో రామశర్మన్ శ్రవణానంద మశ్లీలమయంవా నవేతి తృణీకరణాద్వేత్సి, తత్తత్ర పఠ, తరంగిణీ సర్వథా దుష్టేత్యత్రైవ పఠ, తథాఽపి స్వర్గతి రపేక్షసే, పునఃపునఃపఠిత్వా కృతార్థతా మాప్నుహి, యద్యనృతా ద్యచ్ఛావాచ్యా ద్యదప్యకార్యాచ్చ స్వర్గతి స్స్యాత్తదా లీలాతరంగిణీగతకలుషతరప్రసంగాదపీతి నిర్వివాదః పన్థాః- భవదపలపితేషు స్వర్గతిప్రసంగో ప్యేకః - తిరుపతివెంకటేశ్వరౌ మాం దృష్ట్వా పలాయితావితి లిఖత స్తవ కిమస్తి పాపభీతిః —తదిదం భవద్దేశీయా సరస్వత్యేవ నిర్ణయతి, శోచయతిచ భవత్సాహసం, భవన్నాప్రోపనసౌశీల్యంచ—

(1913 సం॥ జూలై అభినవసరస్వతినుండి)

"...నర్సరావుపేటనుండి తిరుపతివెంకటకవులు పలాయితు లయిరని యివఱ కేయల్బులో వ్రాయుచుండినయంశమే, శ్రీరామారావుగారికిం గడ రుచ్యమై యది యొకగ్రంథ మని వ్రాసి యేకర్మము నెఱుంగని రామశర్మగారిపైం బెట్టుట యెంతయుం జింతావహము,

ఇంత సత్యవిముఖత యేవారియందును జూడంబడదు ,,

శ్లో॥ అపంథానంతుగచ్ఛన్తంసోదరోఽపివిముంచతి ,, (మురారిః)

అన్యేఽపిచ భవద్దేశీయా భవత్సత్యవిముఖతాం బహుధా లిఖంతి, విస్తరభయా దేక మత్రో దాహరామః,

"... వి. యల్. నరసింహశాస్త్రి నమస్కారములు. మీామాం స్తాత్రయం మ॥రా॥రా॥ బెల్లంకొండరామారావుగారిచే రచింపబడి బొగ్గవరపుశ్రీరాములుగారికి కర్తృత్వ మీాయ బడినది. ఈయన ఆఱు వేలనియోగి... పంచకావ్యములుమాత్రము... అచ్చుపొరపాటులేని కనిపెట్టగలంత బుద్ధికుశలత లేదు...,, ఇట్లు, (ఇంగ్లీషుచేవ్రాలు) భవాన్వా ఽన్యోవా నహి తత్ర కశ్చన విశేషః, కింతు— (నాఽనృతం వదేత్,) ఇత్యస్య నా, నరః, అనృతం వదేత్, ఇతితు నకదాఽప్యర్థ ఇతి జ్ఞాత్వా కిమపి వర్తతేచేత్తత్స హృదయైస్సమ్మాన్యతే. నచే దేవ కారార్థే మమగురుశ్చకార మాహేతి వదపహాస్యతాపాత్రం భవతీతి వేదితవ్యమ్

శ్లో॥ "స్వయంతరితు మక్షమః కథ మసౌ పరాం స్తారయేత్ ,,

అహో భవల్లీలాతరంగిణీసమర్థన మేవ మాస్తే, అత్రాన్తరే గౌరుమ ప్యుద్ధర్తుం యతసే త్వమితి పరమాశ్చర్యస్థానమ్, శ్రీకృష్ణలీలా వర్ణనే భవతఇవ తస్యాఽపి కిమపి విపరీతగతి ర్మతి ర్బభూవ, నచే దేవ కారార్థే చకారం కథం ప్రయుంజీత "అన్వయానా మనేకార్థత్వ మిత్యస్మాదృశాం బోధయితు మేవైవం ప్రవృత్తా గురో ర్ధిషణా, నతు ప్రమాదతః, భవతశ్చ భగవల్లీలా స్వశ్లీలం నైవ దుష్యతీతి బోధయితుమే వైతాదృశప్రవృత్తి ముపగతా ధిషణేతి సర్వం సంపన్నం, సు సంపన్నమ్, పరిమితాక్షరంహి వాక్యం లిఖతి గురుః, తదంతరే చకార ఏవకారార్థే ప్రాయుఙ్క్త, తదిదం సత్యమ్ యది సత్యమ్ గురురేవ లిఖతు న తద్భవద్వచనేన విశ్వసిమః, గురుస్తు నైవైవం లిఖే దితి మహా న్ప్రత్యయో ఽస్మాకం, యది లిఖేత్ పురైవ లిఖేత్, భవానపి స్వనామచిహ్నితే పత్రే నైవ మనృతం లిఖతీత్యేవ, కింతు పాపానాం సర్వేషాం భైరవ ఇతివ ద్రామశర్మణ శ్శిరసి పతే దితి కృత్వా కిమపి

యథేచ్ఛం లిఖతి భవా నితి, స్పష్టమవగమ్యతే, కిం బహునా, కస్య చి చ్ఛశ్లోకం మధ్యే కృత్య పత్రికాప్రేషణమేవ భవద్వాదదార్భల్యం విశినష్టి, అధవా

శ్లో॥ మధ్యేకృత్య ఘనం ధినోతి జలధి స్స్వైరంబుభి ర్మేదినీం।
హ న్తి స్వైః కిరణై స్తమిస్ర మరుణం కృత్వాఽ న్తగాళే రవిః
త్వం రామా న్తరితశ్చ పాలయ నిజై రేవ ప్రతాపైః ప్రజా
మీదృక్కోఽపి పరోపకారసుహృదా మేష స్వభావోహివః,,

(మురారిః)

తత్ర దశరథస్య రామా న్తరితత్వ మత్రతు రామస్యైవ రామా న్తరితత్వమితి విశేష ఇతి సర్వం శివమ్

శ్రీపతి వెంకటేశ్వరా,



రభీతిచే నుపేక్షించి యిఁక నీసోదరులు మాసభకుఁ బాపితిమని పత్రిక లలోఁ బ్రకటించిన మాయలేఖలును వానికి సగ్రాసనాధిపతిగారును మల్లాది వెంకటసోమయాజులుగారును మందలించుచు నొసఁగిన ప్రత్యుత్తరములును నుదాహరించి విరమింప నెంచుచున్నారము గానఁ జదువరు లీభాగమును మఱింతశ్రద్ధగాఁ దిలకింపఁ గోరుచున్నారము.

## వేమవరపు సభ

కొప్పరపు సోదరకవుల లేఖలు.

II

శ్రీమత్కనకదుర్గాంబాయైనమః

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన మల్లాది సోమయాజులు గారికి.

నమస్కారపురస్సరముగా నొనరించు విజ్ఞాపనము.

ఆర్యా!

నిన్నటిదినము పగలు 1-30 గంట వేళ తమరును బ్ర॥ శ్రీ॥ మేళ్ళచెర్వు శేషయ్యగారును బ్ర॥ శ్రీ॥ చావలి వేంకటకృష్ణయ్యగారును మాగ్రామమునకువచ్చి, మాయింటికిదయచేసి బ్ర॥ శ్రీ॥ భాగి చెన్నయ్యగారు వ్రాసినయుత్తరమును మాకిచ్చి సభ కాహ్వానము చేసితిరిగదా! ... ... ... ... ... ... ... ...

వేమవరమునకు వేంచేసితిరికదా! వ్యవహార మిట్లుజరిగియుండఁగాఁ దమరు, నిన్నటిదినము సభలో మేము " వారికిని మాకును విరోధము లేదంటి " మనియును (గుంటూరుసీమ) అను పుస్తకమును పబ్లిష్‌చేయవలదని వారిని గోరితి " మనియును, శివరామశాస్త్రి గన్నవరములో మాచేఁ బరాభవింపఁబడెనని యెల్లరకు దెలిసియేయుండ, " మాచేఁ బరాభవింపఁబడెనని మేమెవ్వరితోఁ జెప్పియుండలేదంటి " మనియు,

సభలో నుపన్యసించి సత్యమునంతయు రూపుమాపితిరని నిన్నటిసభ యందుండిన కొందఱచే విని, మీర ట్లనుచితప్రసంగము జరిగింతురా! అనియు నొకవేళ మీరొకరసత్యమాడినను, "పంచాంగములు కాలి నను నక్షత్రములు కాలునా" యనినట్లు యిచ్చటిసాక్షులును మీతో వచ్చిన పెద్దమనుష్యులును అసత్యదోషానలమున కొడిగట్టరుగదా! అనియుఁ దలంచి యీజరిగిన కథయంతయు సభ్యులయెదుటఁ దమకు వినిపించుటకు, మాకుఁబ్రతినిధిగా వీరింబంపితిమి. అసత్యదోషమును బాటింపక మీరీసంగతి యెఱుఁగమని యిప్పుడైన నన్నచో మేమిందు వ్రాసిన కట్టుబాట్ల ననుసరించి జరుగనున్న పందెపుసభ నేఁడు జరిగించినన్ను వచ్చుటకు మేము "సంసిద్ధులమైయుంటి" మని సభ్యులయెదుటను మాప్రతినిధి ఘంటానాదముగాఁ బలుకఁగలడు. ఇందులకు మీరును, మీకవులును నిప్పుడు వారికి సభచేయించినవారును సమ్మతించి వివాదసభ నేఁడేయని పైయంశముల నుదాహరించి యిందరి సంతకములతో నంగీకారపత్రికను బంపినచో మాప్రతిజ్ఞానిర్వాహణముకొఱకు మేము తత్క్షణమే, రా, సిద్ధముగా నున్నారము. ఏమాత్రము శంక నొందఁదగదు. వెంటనే ప్రత్యుత్తర మొసంగఁగోరుచున్నారము.

ఇట్లు,

29—12—12
కొప్పరము

కొప్పరపు సోదరకవులు,
ఆశుకవిచక్రవర్తులు, శతావధానులు.

కొప్పరపుసోదరులయుత్తరకుమారప్రజ్ఞలను దెల్పుమాయ లేఖలలో మొదటిదానిని గొంతవఱకు గుంటూరిసీమసీరికలో విమర్శించి యుండుటచేతను, సోమయాజులుగారి యుత్తరమువలన నందలి తప్పుడుప్రసంగము గతార్థ మగుచున్న హేతువుచేతను లజ్జాత్యాగపూర్వక

ముగా వా రొనర్చిన తప్పొప్పుప్రసంగము నిందుఁ బ్రకటించుట యంత యుక్తము కాదని తోఁచుటచేతను జాలభాగము వదలి ప్రధానాంశ ములనుమాత్రమే తెల్పుభాగము నుదాహరించితిమి. దానికి శ్రీసోమ యాజులుగారిడిన జవాబు నీక్రింద నుదాహరించుచున్నారము. సోమ యాజులుగారిప్రత్యుత్తరము 5 వ ఏప్రియల్ 1913 సం॥ కృష్ణాపత్రిక లోఁ గొంతవఱకుఁ బ్రచురింపఁబడినది. తక్కినభాగముఁగూడ దానితో డనే గతార్థ మని యెంచిన ట్లభినయించి తుట్టతుద నీక్రిందిపంక్తులు వ్రాసి కృష్ణ విరమించినది, ఆపంక్తు లుదాహరించి పిదప సోమయా జులుగారిప్రత్యుత్తరము పూర్తిగా నిం దుదాహరించుచున్నారము.

(5 వ ఏప్రియల్ 1913 సం॥ కృష్ణాపత్రికనుండి)

"స్థలసంకోచముచే నీజాబుయొక్క శేషమును ముద్రింపలేనం దుకుఁ జింతిల్లుచున్నారము, అసలు లేఖలే కల్పితములని చెప్పినప్పు డు వానిని వివరముగ విమర్శించుట యనవసర మని మాయభిప్రా యము. [కృ-ప-అ"]

కృష్ణకు స్థలసంకోచమో మఱియేయితరసంకోచమో తటస్థిం చుటచే శేషమును ముద్రింపక విడిచి వేసినది కాని యసత్యమును రూపుమాపి సత్యముచు స్థిరీకరింపఁ గంకణము గట్టికొన్న మాకు స్థల సంకోచశంక బాధింపదుగదా? స్థలసంకోచమంట? పాపము? కొప్పర పువారి తప్పొప్పుత్తరమున కీస్థలసంకోచబాధ తగుల లేదు కాఁబోలును, ఈవిషయము ముందు విమర్శింపఁ దలఁచి ప్రకృతము సోమయాజులు గారివ్యాసముదాహరించుచున్నారము.

# వేమవరాగ్రహార శతావధానసభ

## కొప్పరపుసోదరకవుల మాయలేఖలు, ఉత్తరకుమారప్రజ్ఞలు.

28-12-12, 29-12-1912 తేదీలను వేమవరాగ్రహారమున శ్రీ భాగిచెన్నయాదులచేఁ జేయింపఁబడిన శ్రీ తిరుపతివేంకటేశ్వరకవుల శతావధానసభలో శ్రీ కొప్పరపు సోదరకవులంగూర్చి నేనేమో యసత్యములు పలికితినని నాపేరటి కొక లేఖయును సభాసనాధిపతిగారగు శ్రీమాన్ వంగిపురముకృష్ణమాచార్యులు (బి. ఏ., యల్. టి.) గారు కూడఁబక్షపాతియైనట్లు వారి పేరటికి మఱియొక లేఖయు సోదరకవులు తమప్రతినిధిచేత రెండవనాటిసభలోఁ జదువుటకై పంపినట్లును, వాని సభాసనాధిపతిగారు నాటిసభలో జదువనీయక నిగ్రహించినట్లును, నోరికివచ్చినట్లెల్ల తెగించివ్రాసి జంకును, గొంకును లేక రెండులేఖలను రెండవనాటిసభ తేది (29-12-12)తో నిటివలఁగల్పించి, 8-2-1913 15-2-1913 తేదీలుగల కృష్ణాపత్రికలోను, 19-2-13 తేదీగల యాంధ్రపత్రికలోను బ్రకటించిరి. ఈ రెండులేఖలుగాని సోదరకవులనుండి మఱియేలేఖలుగాని నాటిసభలోఁజదువుటకు వారిప్రతినిధులెవ్వరును బ్రశంసించియుండలేదు. కావున నవి యదృష్టశ్రుతపూర్వములు; కేవలనవీనకల్పితములు. అగ్రాసనాధిపతిగారికిఁగాని, యాసభలో మఱియెవ్వరికిఁగాని, అప్పుడు తెలియకుండఁ బత్రికలయందుమాత్ర మిప్పుడు సభనాటితేది (29-12-12) తోఁగానంబడిన యాలేఖలనుఁ గల్పించుట 'తప్పుసృష్టి' యనవలెనా? 'నూత్నసృష్టి' యనవలెనా? మఱియేమన వలెను? ఇవి మాయలేఖలనియు, వీనినిట్లుకల్పించుట తంత్రమనియుఁ దప్పక యనవచ్చునుగదా? ఇంతటి శుద్ధాబద్ధమున కొడిగట్టిన యీ

సోదరకవులసాహసమెంతటిది? 'నిండమునిఁగినవారికిఁ జలిలేదు" గదా? ఈలేఖలు మొదలే కల్పితములయినప్పుడు, ఇందుఁ జేయఁబడినదోషారోపణలుకూడఁ గల్పితములుగానేయుండుట సహజమేకదా? గొంగడిలో నన్నముదినుచున్నయెడల నంను బొచ్చేలరాకుండును! సోదరకవులు నన్నును, అగ్రాసనాధిపతిగారిని, శ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులను, సభ్యులలోఁ గొందఱిని, అన్యాయముగా నిందచేసినందున సత్యాసత్యనిర్ణయముకొఱకీ క్రిందియంశముల నానుపూర్వకముగా తెలుపవలసివచ్చినది.

సోదరకవుల నాహ్వానముచేయుటకై చెన్నయ్యగారు ముద్రితములైన రెండు సభాహ్వానపత్రికలను తమయన్నగారగు శ్రీరాములుగారిచేతికిచ్చి పంపినట్లును, అందుమీఁద "మహారాజరాజశ్రీ" యని యుండుటచేతఁ దమకది గౌరవార్హము కాదని "బ్రహ్మశ్రీ" యని వ్రాయవలసినదిగా వారుకోరినట్లును, వారికోరిక ననుసరించి "బ్రహ్మశ్రీ" యని సవరించి మఱియొకముద్రితపత్రికను చెన్నయ్యగారు "తమయూరిమొహతాను" చే వారికిఁ బంపినట్లును నాకుఁదెలియవచ్చినది. అంతట వారు తమబిరుదావళు లందులో లేవనియు లేఖను దురకవానిచేపంపుట తప్పనియు నింకొకమిషఁబెట్టి కొప్పరపుకామయ్య వ్రాలతో సభాప్రారంభదినము పగలు 11 గంటలకు సోదరకవులు బదులుత్తరము పంపుటవలన, సభానిర్ణేతలు నెపము తమయందుంచుకొన నిష్టము లేనివారైనందున నందొక్కరగు శ్రీ మేళ్లచెర్వు శేషయ్యగారు కొప్పరమునకు సోదరకవుల నాహ్వానముచేయుటకు గుఱ్ఱపుబండిమీఁద వెళ్లుచు శ్రీ చావలి వెంకటకృష్ణయ్యగారిని నన్నును దమతోఁగూడరమ్మని కోరినందున మేము మువ్వురమును బగలు 1 గంటకు కొప్పరముచేరి

కామయ్యవ్రాలతోవచ్చిన లేఖలోని కోరికల ప్రకారము "బ్రహ్మశ్రీ" తోడను, బిరుదావళ్ళతోడను, గూడిన మఱియొక యాహ్వానలేఖను సోదరకవులకిచ్చితిమి. అటుమీఁదట వారికి దీనిమీఁద బదులు చెప్పుట కేమియుఁదోఁచకపోవుటచేతను, ఈలేఖ నింకను నాక్షేపించుట కవకాశము లేకుండుటచేతను, గొంతసేపు నిరుత్తరులుగా నూఱకుండి వెనుకటి యాహ్వానలేఖలలో "మహారాజరాజశ్రీ" యని వ్రాయుటతప్పని కొంతవఱకు బెనఁగులాడి యంతటఁ మెల్లగా సర్దుకొని కామయ్యవ్రాలతోవచ్చిన యుత్తరముసంగతులు తమకుఁ దెలియన ట్లభినయించిరి.

ఇఁక సభకేల మీరురాఁగూడదని మేము బలవంతముచేసిన మీఁదట, వెనుకటిమిషల నట్టె వదిలిపెట్టి, యీసభ తిరుపతి వెంకటేశ్వరకవులను సన్మానించుటకుఁ జేయింపఁబడినది గనుకను, వారికిని మాకును విరోధమున్నదిగనుకను, వారితోఁదమకుఁగలవివాదముపరిష్కరించుసభ కాదుగనుకను, అందుచేనీసభకురామని సోదరకవులుమాతోఁ జెప్పిరి. "వివాదసభగతసంవత్సరము గుంటూరిలో మీరుచేసెదమనివ్రాసియు మీరు మానుటచేతను, మీరు సభనిర్ణయించిన తేదీయందే శ్రీ తిరుపతి వెంకటకవులు గుంటూరిలో సభచేసినను మీరు రాకుండుటచేతను, వివాదసభ యింకేమున్నది? మీకుఁ బాడినదేపాటయా?" యని మాలో నొక్కరయిన శేషయ్యగారు వారల నడిగినప్పుడు దానికి జవాబుచెప్పుటకు సోదరకవులిద్దఱు నేమో యాలోచించుకొనుచుండఁగా మాలో నింకొకరగు వెంకటకృష్ణయ్యగారు సోదరకవులతో "పోనిండు! వివాదసభ యిదివఱకు మీరు మానుకొన్నను, ఇఁకమీఁదనైన దానికి మీరు నిలుచుట నిజమేనా! అట్లైనఁగట్టుబాట్లు మొదలగునవి యేవి?" యని వారలనడుగఁగా వార లెన్నెన్ని

సాకులు చెప్పినను గృష్ణయ్యగారు నిగ్గుతేల్చవలెనని గట్టిపట్టుపట్టుటచే "తాతాచార్యులగారిముద్ర భుజముతప్పినను వీపుతప్పదు" కాబోలు ననితలంచినట్లు వెలవెలబోయిచూచుచు రసముతోను మఱిదేనితోను పనిలేకుండ వేగప్రధానమైన కవిత్వమునకొప్పుకొన్నచో మేమునభ కొప్పుకొందుము దానికిఁగొందఱు మాధ్యస్థులు పరిష్కరించి చెప్పి నట్లే కానిండు అని యప్పటిబారి తప్పించుకొని సవినయముగా నపుడు బలికి యిప్పుడేమేమో సభకుసంసిద్ధులముగానున్నామని పత్రికలమూ లముగా సోదరకవులు స్వోత్కర్ష చేసికొనుచుఁ బ్రతిష్ఠసంపాదింపనుం కించుచున్నారు. మఱియు తమవెనుకటిగుట్టుబైటపడినట్టగునేమోయని జడిసి వివాదసభజరుగుటకులోపుగా శ్రీతిరుపతివెంకటేశ్వర ప్రణీత మైన "గుంటూరుసీమ" యనుగ్రంథమును సభలోజదువవలదనియును బ్రకటింపవలదనియును, అట్లుకానిచోఁదామును జల్లిసీమయో! యేసీ మయో? ప్రకటింపవలసివచ్చుననియు, ఈసంగతులను సభలోఁజె ప్పఁడనియుఁగోరిరి. అంతటమాప్రసంగము ముగిసినది. అప్పటికి 5 గంటలయినది. అప్పుడుబయలుదేరి సాయంకాలము 7 గంటలకు వేమ వరము చేరితిమి. అప్పటికిసభముగియనున్నది.

మేము వేమవరముచేరినతోడనే యాలస్యమేమియుఁజేయక అగ్రాసనాధిపతిగారి యనుజ్ఞనుబొంది సోదరకవులు చెప్పఁడన్నప్రకా రము (1) వారు సభకురాకుండుటకు గారణము అది వివాదపరిష్కా రసభ కాకపోవుటయనియు (2) ముందు వివాదసభ మధ్యవర్తులమొ దుటజరిగి పరిష్కరింపఁబడుటకును "గుంటూరుసీమ" చదువవలదని యును, కానిచో దాముజల్లిసీమయో, ఏసీమయో, ప్రకటింపవలసివ చ్చుననియును; ఉన్నవియున్నట్లు సంగతులనెంతో మార్దవముగాను,

నిష్పక్షపాతముగాను, నేను చెప్పితిని. ఆపిమ్మట మా రాకపోకలకాల విలంబనమునుగూర్చి పలికితినిగాని, ఏపక్షమువారిమనస్సును నొచ్చుకుం డునట్లు నేనుసభలోనుడివితిని. నేనుచెప్పినసంగతులలో నిందాస్పద ములైన మాటలెంతమాత్రముండినను సభ్యులెట్లుసహింతురు!

మఱియు నగ్రాసనాధిపతిగారుకూడ 'నేనుబల్కినవిషయములు సత్యములేయని తమనమ్మకమైనట్లును అందులో నెవరినిందగాని లేశమునులేనట్లును నిండుసభలోసెలవిచ్చుటెట్లు సంభవించును?

సోదరకవులు "శత్రువులమీసములనూడదీయింతుము" అనితా ముమాతో చెప్పినట్లిప్పుడు మాత్రము ప్రగల్భములు కొట్టుచున్నారు గాని, అప్పుడీమాటలు మాతోనన్నట్లువ్రాయుట సాహసము. ఆమా ట మాతో ధైర్యముగా నెట్లుచెప్పగలరు? తాము వారిమీసములు దీయింతుమన్నప్పుడు, తిరుపతి వెంకటేశ్వరులు 'తమశత్రువులజుట్లు దీయించి బొట్లుపెట్టింతుమని" అనఁగూడదా? వారనకున్న నప్పుడు మేమైనను మఱియెవ్వరైనను, అనియుండరా? అట్లుసోదరకవులన లేదు గనుక నే సభలోనేను చెప్పలేదు. సోదరకవులు తాముగన్నవరములో శ్రీవేలూరి శివరామశాస్త్రిగారిని జయించినామని చెప్పుచున్నమాట లనుగుఱించి కొప్పరములో నిజముగాఁబ్రస్తావన వచ్చినదిగాని, మాక వుఁది పరిహాసాస్పదముగాఁ దోఁచినందున ఆసంగతులు నాటిసభలో జెప్పవలసినప్రసక్తి యేమియులేకుండుటచే నేనుచెప్పలేదు. లజ్జామే కాంపరిత్యజ్య త్రైలోక్యవిజయాభవేత్ అను మాటసత్యము సోదర కవులకు, దిరుపతి వెంకటేశ్వరకవులయెడల నాతోశత్రుభావమున్న సంగతి సుప్రసిద్ధమైయుండగా వారికిని వీరికిని విరోధములేదని నేనెట్ల నుట సంభవించును? ఔరా! కొప్పరపుఁగవులకెంపెత సొంపువార

లకంపెంతయింపు? అందఱికింకంపు.

తిరుపతి వెంకటేశ్వరకవులు శతావధానకార్యనిరతులై యుండినపుడుగదా కొప్పరమునుండి మేమువచ్చితిమి. తిరుపతిశాస్త్రిగారికిని మాకును సమావేశమేకలుగనప్పుడు మాప్రసంగము వారికి దెలియుట యెట్లుసంభవించును! "వారునాచే నసత్యములుచెప్పించి తమవారిభుజములు పొంగించుటకై వృథాప్రసంగములను జేయించుచుండిరి" యని సోదరకవులు వ్రాసినయోర్పులేనిమాటలెట్లు పొసఁగును? ఇది "పృష్ఠతాడనాద్దంతభగ్నః" అన్నట్లున్నది. నేను సభలోమాటలాడినపిమ్మట నిజమెఱిఁగిన యొకరిద్దఱు తమపక్షపువారు లేచి యిట్లసత్యములు చెప్పరాదన్నట్లును, వారికగ్రాసనాధిపతిగారు తగునంతటి యుపకారమిూయక బెదరించిరనియు, సోదరకవులు వ్రాసికొనిరి ఒకరిద్దఱనుట గౌరవార్థమో! మఱియేమో! కాని యామాటలాడిన యతఁడొక్కఁడే. అతఁడు సోదరకవుల కుపకారముచేయఁబోయి, పాపము! అపకారమే చేసినాఁడు అదియెట్లనఁగా— కామయ్యవ్రాలుతో జెన్నయ్యగారికివచ్చినయుత్తరము వ్రాయఁబడినపుడు తానుఁకొప్పరములోనుండియున్నట్లును, సోదరకవులీయుత్తరమును స్వయముగానే తురకవానిచేమఱల పంపినసంగతి తానెఱుంగుదుననుటయే కాక మాదిగవానిచేనేలపంపరాదని సోదరకవులకుఁ దానుసలహాయిచ్చినట్లును, వారుసభకురానికారణమిదియే కాని వివాదసభావిషయముకానట్లును సభ్యులందఱియెదుట నుడివెను. పాపము! అతడుతా నెఱిఁగిన నిజముచెప్పినాఁడుగాని సోదరకవులామిషవదలి మఱియొకమిషమాలో చెప్పిన దీతనికెట్లు దెలియును?

సోదరకవులు సభకురానికారణము వారుపత్రికలలో నెట్లుప్రక

మునిర్ణయించిన సభాదినమునకు తాము రాలేక వారియుత్తరమునకుఁ బ్రత్యుత్తరములీయక ముగించుకొని, బందుగలయిండ్లలో విందులారగించుచు నరండల్ పేటలో నణఁగిమణఁగి యాకులలో పిందెలవలెఁ దాఁకుమాత్రె తలలుదాఁచుకొని, ఆనిర్ణయదినమున వారుసభ జేసి నిజనివాసములకు వెళ్లినపిదప సోదరకవులు తాముగూడ శతావధానము చేసినవారముకావలెనని యెంతోశ్రమపడి యుద్యోగస్థులచెంతఁజేరి సభకూర్పించుకొని చాలునఁగూడ నేపాటిగానైన నిలువనోపక తబ్బిబ్బుపడి తాళఁజాలక తలనొప్పియనితప్పించుకొని తలవాఁకిటఁబడి తాము తరలివెళ్లినసంగతి లోకులు మఱచిపోయిరనుకొనిరికాఁబోలును? ఆసభ నెఱుఁగనిదిగనుకనా? అమ్మపుట్టిల్లుమేనమామవద్దఁ బొగడవలెనా? ఇట్టిదిట్టలైన కొప్పరపుంగవులు, అప్పుడెదుటికైనరాలేక తమకిప్పుడేమో కొమ్ములు మొలచినట్లు బింకముతో అంకెలు వేయుచు నుత్తరకుమార ప్రజ్ఞలుచూపుట యాశ్చర్యముకాదు. సోదరకవులింకనైన మీాసములమాటతలపెట్టక పిచ్చిపిచ్చిపోకలంబోవక చదువుసంధ్యలు చక్కఁగానేర్చుకొని మృషారోపావేశముమాని పండితధిక్కారములఁబోఅడోలి సాధువర్తనులై శాంతివహించి మనుదురుగాక.

*N B* —ఇందలి సత్యనిర్ణయమునకై న్యాయదృష్టిగలవారు ప్రత్యక్షముగా నెఱింగనదానిని దెలుపుదురుగాక.

గుంటూరు. } ఇట్లు
5-3-13 } విన్నవించు

మల్లాది వెంకటసోమయాజులు.
టీచరు. ఏ. ఇ. యల్. యమ్ కాలేజి,
గుంటూరు.

ఈసోమయాజులుగారు విద్యావయోవృద్ధులు కాలేజీటీచరులు, సంస్కృతాంధ్రహూణభాషాపరీక్షులు, సత్యసంధులు నని యిదివరకే వ్రాసి యుండుటచే నిందు విస్తరింపఁ బని లేదు ఇట్టివారిపవిత్రవాక్యములకు స్థలసంకోచమును గల్పించినకృష్ణ నేమని వర్ణింప వలయును, ఈవర్ణనముంగూర్చి పంటూరిసీమయే తెల్పునుగానఁ బ్రకృత మవధరింపుఁడు—

1913 సం॥ ఫిబ్రవరు 8 వ తేది కృష్ణాపత్రికనుండి

## వేమవరపుసభ

కొప్పరపుసోదరకవుల లేఖలు

శ్రీమత్కనక దుర్గాంబాయైనమః

1912 సంవత్సరము డిశంబరునెల 28, 29 తేదీలలో వేమవర గ్రామమున శ్రీ తిరుపతి వేంకటకవులు శతావధాన తంత్రమును గావించిరి. ఆసభకు మమ్ముల నాహ్వానము చేయుటకై బ్రహ్మశ్రీ భాగి చెన్నయ్యగారు బ్రహ్మశ్రీ మల్లాది సోమయాజులుగారిం బంపిరి. అప్పుడు వారికిని మాకును గొంతప్రసంగము జరిగెను. సోమయాజులుగారు మాతో నొకవిధముగఁ జెప్పిపోయి. తి. వేం. ల తొలినాటి సభలో మేము చెప్పఁదన్న మాటల గప్పిపుచ్చి, చెప్పనిమాటలం గల్పించి చెప్పిరి! ఆవృత్తాంతము మాకుఁ దెలియవచ్చినందున నీక్రిందఁ బ్రకటింపఁబడు లేఖలను వ్రాసియిచ్చి వానిని సభలోఁ జదువుటకై [మాప్రతినిధి నొకరిని మఱునాఁటి సభ వేళకనిపితిమి.] కాని, నిజము బయలు పడునను భయముచే వారాలేఖలను జదువనీయరైరి! అందువలన లోకనివేదనార్థము వాని నీక్రిందఁ బ్రకటించుచున్నారము.

యుచు నాడినదాటగాఁ బాడినది పాటగాని ష్టమువచ్చినట్లెల్ల జరుపుచుండినను, వేమవరమునకు 8 మైళ్ళ దూరము నందుండిన మమ్ముఁ గూర్చి సోమయాజులుగారిచే ననత్యములను జెప్పించి తమవారి బుజములఁ బొంగించుటకునై తిరుపతి శాస్త్రిగారు వృథాప్రసంగములను జేయుచుండినను, దమరు సహించితిరని వింటిమి

"కం॥ దాక్షిణ్యంబును బక్షా।
పక్షంబులు దల। పకుభయపక్షము లెనఁగా।
వీక్షించి తగవు దీర్చువి।
చక్షణులకు నిహపరముల। సౌఖ్యము కలుగున్॥

అను నీతి నెఱింగిన తమరగ్రాసనాధిపత్యము వహింపగాఁ నిట్టి యనుచిత కృత్యములు జరుగుట సత్యమేయైన యెడలఁ గలికాలపు మహిమగా నెంచవలసియున్నది! ఉభయ పక్షములను సరిగాఁ జూచినచో నొకవేళ నల్లరి యతిశయించు నేమోయని శకించి మీరిదివఱకేది యెట్లు సేయఁదలంచినను జేసినను మేముసభకు రానికారణమును మమ్మాహ్వానము సేయవచ్చిన వారికిని మాకును జరిగిన ప్రసంగమును సభ్యులకందరకును దెలియుటకొరకు మేము వ్రాసిన లేఖలను సభలోఁ జదువుటకై మాప్రతినిధిగా నొక్కరిని బంపితిమి. కావున దయయుంచి మాలేఖలను మాప్రతినిధి చదువుట కనుజ్ఞయిచ్చి నిష్పక్షపాత బుద్ధులను సత్కీర్తిని దమరందుదురని నమ్ముచున్నారము. ఈ లేఖగూడ మాప్రతినిధియే తమసన్నిధిని సభలోఁ జదువ నంగీకరించుటకై ప్రార్థించుచున్నారము.

ఇట్లు,

29—12—12 } కొప్పరపు సోదరకవులు,
కొప్పరము } ఆశుకవి చక్రవర్తులు శతావధానులు.

ఇది శ్రీవంగిపురం కృష్ణమాచార్యులుగారిపై నపవాద మోపు మ వ్రాసినకొప్పరసోదరులమాయు లేఖ, దీనికి బ్రత్యుత్తర మిడుటకు శ్రీయాచార్యులవారు చాల నాలస్యము చేసిరి దానికిం గలకారణము ను శ్రీవారే తుట్టతుదను దెల్పి యున్నారు వారియాలస్య మటులుం డఁగాఁ గృష్ణాపత్రిక వీరవ్యాసము నింతవరకు నవఁగా సుమా౧ప మూ డుమాసములు కావచ్చినను నేసంకోచముచేతనో ముద్రింపఁ జాల ద య్యె ఆలోచింపఁగా నీపత్రికకు ఘనులవ్రాఁతలయందు గౌరవ మంత గా లేదని చెప్పవలసివచ్చుచున్నది. బి యే యల్. టీ పరీక్షనిచ్చి చిరకాలమునుండి గుంటూరికాలేజిలో సహోపాధ్యాయులుగా నుండి సత్యసంధులని పేరు వడసిన శ్రీయాచార్య లవారివ్యాసమునకన్న నికృష్టకుఁ 'గోష్ఠీప్రసంగమును" "గుక్కలప్రసంగమును" బ్రచురిం చుట యత్యావశ్యకముగాఁ గన్పట్టుట మిగులశోచనీయ మని మాయ భిప్రాయము ఇదిగాక ఎవరిపై నపవాద మోపినకొప్పరపుమాయు లేఖ లను దాను బ్రత్యక్షరమును ముద్రించినదో వారిప్రత్యుత్తరమును ము ద్రించుటకుఁ గృష్ణకింతమాంద్యమేల కలుగ వలెనో బుద్ధిమంతులే పరి కింతురుగాక వారు ప్రకటింపకుందురుగాక మాపత్రిక యుండఁగా వారి కీరితోఁ బనియేమి మేమే దానిని బ్రత్యక్షరముగా నిం దుదాహరిం చెదము.

శ్రీమతేరామానుజాయనమః

క॥ శ్రీరాజజ్జగమెల్లను
నారూఢిగ సత్యవిషయ మవలోకింపం
గూరిమి యత్నముసల్పెడి
నాకరరె సేఁ..గ న ..... ..... ౨—

రగడ పాటలగంధులు పాటలఁ బాడుచు.
పాటలభూజపుఁదోఁటలఁ గూడుచు
లేమా? కందములే మాకందము
రామా మెల్లన రామా కందము
జాలకతతి యీఁ జాలక డాఁచితె
కదళికిఁ జెలిచను కదళికిఁ జూచితె
బాలామణి మరుబాలాతరువులఁ
జాలా హెచ్చెను జాలాతరువుల
వాదు లేల విరివాదులకై చెలి?
మోద మెసఁగె ననుమోదకవిరిపుళి
పొన్నరిగో సఖి? పొన్నవిరులగుమి
మొన్నఁటి కది నీవెన్నవుగద తమి
నీగోరంటకు నీగోరంటకు
రాగమునినఁగద రాగమదంటకు
గన్నెర గైకొనఁ గన్నెర చేసెదు
క్రన్నన యిట వీఁక న్నవ రోసెదు
ఈలతకూనకు నీలతకూనలె
చాలదె తేనియజా లదె సోనలె
గురువిందలు తగగురువిందము లన
నరవిందగ వెస నరవిందంబున
తిలకమి[illegible]వధూ తిలకమకంటివె
కలరవములకల కలములువింటివె
ఎ అవముగదయీ మరువముమాటికి
మఱిమఱివనిద్రిమ్మరియెదుసాటికి
సన్నజాజులకు సన్నలుసేయకు
సన్నుతగుణవధు సన్ననుబాయకు.
కౌరవివేకమగు కౌరవిన్ననగొన.

పరువమగుఁజూమీ పరువడిఁజనఁజన
మొల్లమిగనెనీ మొల్లవిరులకుది
పల్లవములుగనఁ బల్లవించుమది
తియ్యనిరుచిలెను తియ్యనిఫలమిదె
యియ్యతివకునే నియ్యఁగవతెఁగద.
చిల్కలెల్ల నీచిల్కలకొలుకుల.
కలికిపలుకువగ కలికెనుగెలఁకుల
తుమ్మెదపోకటు తుమ్మెదగఁబచిన.
సమ్మదమెటుదో సమ్మటవెఱచిన
నిమ్మగువకుఁదగు నిమ్మగువలపులు.
తమ్మలఁగలనె త్తమ్మలపొలుపుల ॥ 35

వ॥ అని యివ్విధంబున మఱియును. 36

మ॥ మెఱుఁగుగ్ లేఁ జిగురుగ్ జటచ్ఛటవిజృంభింపంబరాగంబుభూ
తి రహిగ్ మించ వనుల్ నిజాంతికమునగ్ దేజంబు గాంచగ్ శివా
తరుణీలీలఁ దగగ్ శుకద్విజఫలార్థప్రాప్తి రాణించ నే
కరసాలప్రభువైభవం బలరె నోకంజాక్షి! వీక్షించితే॥ 37

గీ॥ పణఁతి! యీలతకూనపు ష్పిణి యటన్నఁ గేల నిపు డంటఁ దగునె నీవేల యిప్పు
డలరుకొమ్మ రజము గల దౌట దెలిసె, సంస్పృశించితి ద్విజరాజి సందడింప॥ 38

గీ॥ శ్యామయతా వనమధ్యస్థ సరణిఁ దగియెఁ, శ్యామ యౌవనమధ్యస్థ సరణిఁదగదెఁ 39
పాటలాధర సుమనఃప్రభావమలరె, పాటలాధర సుమనఃప్రభావ మలరె॥

గీ॥ పురుషసంగతి నలర నీతరుణి ధరణి, మదనశరపాళి నెనయంట వీడిత మిపుడు
పురుషసంగతి నలరియుఁ దరుణి యిచట, మదనశరపాళి నెనసిన మాడ్కిఁగాంచె 40

(ఈక్రింది పద్యము మొదలు గొన్ని పద్యములు నిరోష్ఠ్యములు)

క॥ లలినీలచలిత కిసలయ, కలికర ఘనాళినినద గానగ్ గణికా
కలకంఠిని గాంచితి, ద ల్లలిత నటనతాళగతి చెలంగఁగఁ దనరన్॥ 41

మ॥ కలికీ! కాంచన కేతకీదళ లసత్కాంతిచ్ఛటల్ చంచలా
కలనగ్ గానఁగ నయ్యె నీలజలదాకారస్థితిగ్ దాల్చె న

క్కలసన్ సాంద్రకరంబు రాజికరకా క్కర్ణాకృతిన్ హెచ్చె త
త్కళికల్ తేనియ జల్లక ప్రాగతిగా కాంతార ధాత్రీస్థలిన్॥ యెల్లెడ గా యుండెడ॥ 42

క॥ కలకంఠికాళికీకి, న్యళివీకీరతతికేళి నలరెన్ శాఖా
లలితలతలెల్లకడలన్, గలకంఠీహర్ష లీల గాంచితె యిచటన్॥ యుపాడు దొంరిడు॥ 43

సీ॥ ఘనసారఘనసార కదళికాసారంగ, కాంచనకేతకీ కందరాళి
సాలరసాల చించాక్షీరికానటే, సర్జకేసరళిత సరళతిలక
కర్ణికారశిరీష గణికారికాజయా, శాండిల్యకరక కీచకకరీర
తాలహింతాల నందన సల్లకీనారి, కేరదద్గుకాంతారచలద

గీ॥ శాదిఘనశాఖిశాఖాంత రాలగత్వ, గాదికనినాదసహితల తాంతనిచయ
సంచరచ్చంచరీకఝుం ఝుంక్రియల్ దనర్చె నాలించితిరె మీన నయనలార॥ 44

గీ॥ కాననేందిర కంధర గట్టినట్టి, తారహారాళి యనగ నీహారదెశ
కలితలలితలతాతతి యలరె నిట్టి, చిత్రగతి ధాత్రిగంటిరె చెలియలార॥ 45

క॥ శరనిధిరాట్కాంతిశర, చ్ఛరదాకృతి గెల్చి యిచట శరతతి దనరెన్
సరసిజసదృశానన యా, శరజశరజగన్నటాద్య శశ్వయరీతిన్॥ 46

క॥ హల్లకతతిసారసచయ హల్లీసకరీతి జాల నలరెడి సరసిన్
సల్లలితకిసలరేఖిక సల్లకి దనరాలె నచట సారంగాక్షీ॥ 47

క॥ అని యీగతి నతిలీలన్ దనరన్ జలజాననలు నితాంతక్రీడా
ఘనతన్ జనితాహ్లాదత నన లందిరి కాంతు హస్తనతశాఖికలై॥ 48

సీ॥ సికతాస్థలనితాంత శృంగారకల్హార, కీర్ణనీరేజ దీర్ఘికలకడల
నెలరాలదీదితి గలతిన్నియలజాడ, (చెయెత్తు) టెంకాయ చెట్లనీడ
ఏలాలతలచెంత హెచ్చైనయీరాల, ధాత్రీనిరంతర ధాత్రిచెంత
కదళీదళాకీర్ణ కాంతారతతిచాయ, జాతిగంధలహరి, సరణిదండ॥

గీ॥ సరళకాంచనతిలకాది సాలరాజి, (రాజితాక్రీడవీధికారాజియందు)
వనిలసంచలదలకలై యఖిలదిశల, సంచరించి నెలంత లాశ్చర్యలీల॥ 49

వ॥ మణిమయనివ్వనరాశి వనర్గాశిచందంబున విద్రుమలతామందారచంద్రలక్ష్మీరగ
భాద్యుదయకారణంబై నందనవనంబుకరణి, నిరంతరసుమనోవికీర్ణంబై, కైలాసశైలంబు
ధంబున నీలకంఠకుమారశోభామతీవినాయకగణవిభాసితంబై చైత్రరథంబువిధంబునన్నంబు

ణ్యాజనసర్వలీలాధూర్వహంబై సరోవరంబుడంబున సితాంబుజకువలయాభిరామంబై, కాననంబు గావున నిఖిలద్విజక్రుత్యానుమోదకలరవాంచితంబై వనంబు గావున పథికజనతాపదానకారణంబై నవరతమహీశావిలాసబంధురం బయ్యు ననవరతమహీశావిలాసబంధురంబై విరాజమానతుంగకదంబం బయ్యు నవిరాజమానతుంగకదంబంబై యొప్పుచున్న దని యయ్యొప్పులకుప్ప లుప్పతిలు వేడుకల మెప్పులర నేర్పునఁ దిరుగుచు 50

సీ॥ కేళిమై నెపుడు కంకేళిపదం బుంచి సురపొన్న నవ్విభాసురత నించి
వావిరి నిట్టూర్పు వావిరి నిడి యొడికంబుగ నడితిలకంబుఁ జూచి
సంపంగిముఖకాంతి సంపద నలరించి కరము చూతమ్ముపైఁ గరము చాచి
పొగడంగఁ దగునట్టిపొగడపైనుమిసి చక్కన ముదం బలర బ్రేంకనముఁ బాడి
గీ॥ కొమ్మలత్తఱి వేగాని కొమ్మలెల్లఁ గౌఁగిలించుచు దోహదక్రమము దనర
నవ్వనంబునఁ గ్రీడించి రంచితగతి నభ్రమండలిఁ గ్రొమ్మించు లలరినట్లు॥ 51

వ॥ తదనంతరంబ॥ 52

ఉ॥ కాంచిరి చంచలాక్షులు వికస్వరకైరవహల్లకావళీ
చంచదళిధ్వనిప్రకట సారసుగీతరసాభిరామముగా
బంచశరార్తిహేతుసితఁ పత్రసమగ్రవిహారధామముగా
గాంచననీరజాతనవ గంధమనోజ్ఞ సరోలలామముగా ॥ 53

ఉ॥ కాంచికటీతటీఘటిత కాంచనచేలములగా దృఢస్థితిగా
గాంచికలగా బిగించి మణికల్పితభూషణపంక్తి చక్కఁగా
నుంచి కరారవిందముల నొప్పగుచిమ్మనగ్రోవి మించులా
మించులసంచు నొంచ నెలమించలిమిం జెలిమిం జెలంగుచుగా॥ 54

క॥ అక్కలకంఠీరత్నము లక్కొలనగా దుముక నప్పు డంబుకణంబుల్
గ్రిక్కిఱిసి ధ్వనులు దిక్కులఁ గ్రక్కదలఁగ భూనభోంతరమున న్నిండెగా॥ 55

సీ॥ కచభృంగజాలముల్ కలితశైవాలముల్ మేలైనజిగితోడ మేల మాడ
వదనారవిందముల్ వనజాతబృందముల్ సహజసద్వాసనల్ చల్లు లాడ
స్తనయుగచక్రముల్ జలజాతముకుళముల్ కవగూడి మొన చూపి కలహ మంద
చెంగావిపావడల్ చెంగల్వపుప్పొడుల్ ప్రకటానురాగసంపదల నెఱప
గీ॥ వళులు వలమానవీచికావళులు నెఱయ లీల జలకేళి సలిపిరి బాల లపుడు
పాలసంద్రంబులోపల నోలలాడు వేల్పుజవరాండ్రగుఱుతులవిధము దనర॥ 56

ఉ॥ గుంపులు గూడి ముద్దువగ గొమ్మలు కమ్మలడాలు చెక్కులన్
సొంపెసలారఁ గైశికరుచుల్ జలకేళి మదాళిపాళిపైఁ
బంపులు గాఁగ గుబ్బల సుపాణిసరుల్ జలబిందురాజిలో
తుంపెసలార నొండొరులు దోయము చల్లఁ దొణంగి రయ్యెడన్॥ 57

వ॥ వెండియు నఖండకాండప్రకాండహిండమానోద్దండసోడ్డీనసండీనప్రడీనప్రచండపునరుత్పతత్పతగపతత్రవాత్యాముహుర్ముహుర్ఘట్టితరణారవిందమరందసాంద్రతరకంకణంబులు కరాంచత్కాంచనమణికంకణంబుల నెదుర్కొన నొండొరుల మార్కొనుచు గంభీరనాభికారమ్యంబులఁ గాసారంబులఁ గలంగించుచందంబున వడి నిగుడన్ దిరుగుచుఁ గుచకుంభసంరంభంబులఁ దదంబుచరకోకావమానం బొనర్పుచు నిజవళీకాళింగారంబుల నుల్లోలకల్లోలంబుల భంగంబులుగాఁ జేయుచు నొక్కళ్లొక్కళ్ల నొడియుటకై డాయుచు మృణాలలతికాకంటకసంకటంబులకు నెడఁ బాయుచు బిసరుహదళపరిహాసనిపుణచరణకిసలయ లగుచుఁ గలకల నగుచు నాఁచుదీవెలఁ దృణీకరించు కీలుజడలు భోగవతిం దేలియాడునీలఫణులవడువున చెదంగడర నడినీటం దేలుచు వెన్కయీఁత లాడుచు నొండొరులతోడఁ బంతంబు లాడుచు హస్తసంఘట్టనచలాచలోర్మికావళులు మెఱుంగులు కరాంగుళులఁ గలయూర్మికలం గలయ వలయఝుణంఝుణారవంబుల గారవంబులు తరంగసంఘసంఘర్షణోత్థితఘుమంఘుమరవంబులకు నవం బగుపరిభవం బొనర్ప హారిద్రాచూర్ణసువర్ణరజోవర్ణవికీర్ణాభ్యర్ణపయోరుహపరాగరంజితార్ణోనిషిక్తంబులైనచలువనిగనిగనిజిలుగుపావడలు హేమాంబరమ్ముల తెఱంగున రంగలరఁ గుచశృంగసంగతకురంగనాభికాపటీరపంకసంకుమదపరిమళమిళద్బంధురగంధవాహస్తనంధయామంత్రితపుష్పంధయభయంకరచికురనికరప్రభావిభవంబునఁ దదంబుపూరంబు యమునాఝురంబుచందంబు నొందఁ దనులిప్తచందనచ్ఛాయాసాంకర్యంబున నొక్కొక్కపరి సరిత్పయోవీచికలు జహ్నుజాకల్లోలజాలంబుల మేలంబు లాడువడువునన్, బోడకట్ట నిజాంగరాగారుణీకృతంబైనయొక్కొక్కయెడ సరోవరంబు శోణభద్రాకారంబు వహింప నిట్టూర్పు గాడ్పులు గ్రమ్మ నెత్తిమ్మిగలువలపాలు పగుమలయనగనిలయవలమానపవమానపరమాణువుల గ్రేణిసేయఁ బెద్దయుం బ్రొద్దు విహరించు నట్టియెడ॥ 58

చ॥ లలన జలంబులో వెలకిలం బడి యొక్కతె యీఁదగాఁ దదీ
యలఁదురోజహారము లాయూరము మీఁ దెఱ సమీరితారస

సీ॥ పుష్పాడికాఁక పోఁ బోలఁతి యొక్కతె వేగ పన్నీరు చిలుకుచుఁ బదములొత్త
వేడివెన్నెలరాత్రి వేఁగినమేనఁ బూఁబోఁడి యొక్కతె విరుల్ పాదివి హత్త
మరునితూపులు దాఁకి నెరసె వేఁడుము లని కొమ్మ యోర్తు వలపుగందములమెత్త
మలయానిలాంకురమ్ములకుఁ జాటుగ యోర్తు, చిగురుటాకరిగెలు చేత నెత్త

గీ॥ చిత్తజునిబారి నెగు లొందిచింతఁ జెంది
నావిరాళికి నడ లంటి యగ్గివంటి
యలరుపాన్పున ధృతి నుండి యవ్వేలంది
యిందుముఖులార! వినుఁ డని యిట్టు లనియె॥ 71

సీ॥ కలికి! భుజంగసంగతిఁ గన్నకేతకీ, సాధ్వి చెంత వసింపఁ జక్కనౌనె
కాంత! పల్లవసమాఖ్య వహించుచిగురులు, సతులపొంత మెలంగఁ జంద మౌనె
చెలి! మధుపాదరస్థితి గన్నసూనముల్, పుణ్యవర్తినులచేఁ బూన నగునె
పొలఁతి! రజస్ఫూర్తిఁ బొరయుఁ బద్మినివిరుల్, సగభీరువు లంద సరస మగునె

గీ॥ యతను ఘోరాయుధప్రౌఢి నతిశయించె
మనమునఁ దలంపఁ గనుఁగొన ననువు గాదు
దూరదూరంబుగ నెవీనిఁదోలఁగఁ ద్రోయుఁ
డింక నెదుటికిఁ దేకుఁడే యింతులార॥ 72

మ॥ తమభోగార్థపదార్థ సంతతుల నిత్తన్వంగి కేళీవనిం
రమణుల్ దానును జూఱలాడె నిదిగో రాజీవబాణా యటం
చు మదాళివ్రజకీరకోకిలము లచ్చో హెచ్చునచ్చెస్వనం
బమరన్ మ్రోఁగెడి నాఁ దదీయరవ మొప్పారెన్ గడున్ వేఁడిమై॥ 73

గీ॥ రమణి! కురువేరు సుకరవాలము గదమ్మ
చెలువరో! కుంకుమం బగ్నిశిఖ గదమ్మ
బాణము గదమ్మ గోరంట ప్రాణ మెంత
వీనిపై మేను సేర్తు నో వెలఁదులార॥ 74

గీ॥ అనిన జెలులెల్ల భయ మంది హాకుమారి!
మగువలకుఁ జెల్లునే! యిట్టితెగువ యింత

సీ॥ చిత్రరేఖ యనంగఁ జెన్నొందునొకయింతి, జిలుఁగుబంగరువన్నె చీర యొసఁగ
నీలవేణి యనంగ నీటొందునొకచాన, జడ యల్లి తెలిమల్లె సరులు చుట్ట
తరలాక్షి యనునొక్క తరుణీలలామంబు, లలితహారంబు లలంకరింప
చందనగంధి యన్ చంద్రాస్య యొక్కతె, యంద మౌకపురంపు గంధ మలఁద

గీ॥ భామినీతిలకంబు నా గణనకెక్క
నొకవధూమణి నుదుటిపై నుదుటుమీఱ
జాతికస్తూరితిలకంబు సరగ నుంచ
నవ్వధూమణి గతిదేవి యట్లఁ దనరె॥ 66

సీ॥ రంగారుబంగారు ముంగర కెంపుల, నాస కాంచనసమున్నతులు నెఱప
మంజునూత్నాంజన ఖంజనీలాభతోఁ, గనుదోయిఖంజనకలనఁ జూప
కుండలద్యుతిమిళద్గండసాంకవముతోఁ, గర్ణపూరామోదకలన వెలయ
కంధరాలి ప్రసద్గంధబంధురరుచుల్, ఘనసారహారసత్కాంతి నొలయ

గీ॥ కలయఁజిల్కనపన్నిటఁ గమ్మవలపు
మొలకసంభృతసుమదామముల నెసంగ
వే ఖలాఖిలమణిఘృణి మేళనాంబ
రాంచలద్యుతి పదపల్లవాభ మెలఁగ॥ 67

గీ॥ ఊర్మికాకంకణాదసం యోగకలన
కోలన నలరినకరపద్మములను బద్మ
నీమణి యలంకరించె నెన్నెని కంక
ణములు నూర్మికలును సమగ్రమతి నపుడు॥ 68

వ॥ మఱియు బహువిధాభరణభూషితయై॥ 69

చ॥ ఒకకలశోపమస్తని ర యోన్నతి మ్రోలఁ గళాచి నిల్వ వే
రొకవలమాననేత్ర ముద మొప్పఁగఁ బావడ వేయ వీడె మొ
క్కకపురగంధి బట్టి యొసఁగన్ గయికొంచు జగాతి వాచిపై
సకియలు గొల్వ నిందుమతి సారె మనోజశరార్తి గ్రాఁగఁగన్॥ 70

సీ॥ పుష్పాదికాఁక పోఁ బొలఁతి యొక్కతె వేగ పన్నీరు చిలుకుచుఁ బదములొత్త
వేడివెన్నెలరాత్రి వేఁగినమేనఁ బూఁబోడి యొక్కతె విరుల్ పాదివి హత్త
మరునితూపులు దాఁకి నెరసె వేఁడుము లని కొమ యోర్తు వలపుగం దములుమెత్త
మలయానిలాంకురమ్ములకుఁ జాటుగ యోర్తు, చిగురుటాకరిగెలు చేత నెత్త

గీ॥ చిత్తజునిబారి నెగు లొందిచింతఁ జెంది
నావిరాలికి నడ లంటి యగ్గివంటి
యలరుపాన్పున ధృతి నుండి యవ్వెలంది
యిందుముఖులార? వినుఁ డని యిట్టు లనియె॥ 71

సీ॥ కలికి! భుజంగసంగతిఁ గన్న కేతకీ, సాధ్వి చెంత వసింపఁ జక్కనౌనె
కాంత? పల్లవసమాఖ్య వహించుచిగురులు, సతులపొంత మెలంగఁ జంద మౌనె
చెలి? మధుపాదరస్థితి గన్నసూనముల్, పుణ్యవర్తినులచేఁ బూన నగునె
పొలఁతి? రజన్యార్తిఁ బొరయు పద్మినివిరుల్, పరగభీరువు లంద సరస మగునె

గీ॥ యతను ఘోరాయుధప్రౌఢి నతిశయించె
మనమునఁ దలంపఁ గనుఁగొన నను వుగాదు
దూరదూరంబుగనె వీనిఁదొలఁగఁ ద్రోయుఁ
డింక నెదుటికిఁ దేకుఁడె యింతులార॥ 72

మ॥ తేమభోగార్థపదార్థ సంతతుల ని త్తన్వంగి కేళీవనిం
రమణుల్ దానును జూఅలాడె నిదిగో రాజీవబాణా యటం
చు మదాళివ్రజకీరకోకిలము లచ్చో హెచ్చునుచ్చైస్స్వనం
బునరక్ ద్రోఁగెడి నాఁ దదీయరవ మొప్పారెక్ గడుక్ వేఁడిమై॥ 73

గీ॥ రమణి? కురువేరు సుకరవాలము గదమ్మ
చెలువరో? కుంకుమం బగ్ని శిఖ గదమ్మ
బాణము గదమ్మ గోరంట ప్రాణ మెంత
దీనిపై మేను సేర్తు నోవెలఁదులార॥ 74

గీ॥ అనినఁ జెలులెల్ల భయ మంది హాకుమారి?
మగువలకుఁ జెల్లునే? యిట్టితెగువ యింత

సాధ్వసం బేల రతినాథు సంస్మరించి
యతనిఁ బూజింప ఫలియించు నభిమతంబు॥ 75

క॥ విసువకు మన బిసరుహాముఖి। కుసుమాయుధుఁ బూజ సేయఁ గోరుటయుఁ జెలుల్
రసవత్ప్రసవాదికములు। వెస మసలక తెచ్చి ప్రోల వేడుక నిడిరన్॥ 76

సీ॥ కపురంపుటనటిచెంగటిచెల్వ చెంగల్వ, కొలనికెలంకుల కలనుమీఱు
వేమల్లెతీఁగె లల్లినగుజ్జుమామిడి, సురపొన్నగున్నలఁ జుట్టుకొన్న
కన్నెగేదఁగిపంచెఁ గలగుంపుసొంపులు, గలుగుగందపుచెట్లు గ్రందుకొన్న
తోట నింపైన పన్నీటికాలువవెంట, నందపుబండిగుర్విందపొదల

గీ॥ తుదల మెదలెడితుమ్మెద రొదలఁ బొదలు
తేటపూఁదేనెజడివాన దీటుకొనిన
మేటిసెలయేటివెంటఁ గ్రొమ్మెఱుఁగు లీను
మానికపుమెట్లసెంరాల తీనెమీఁద॥ 77

క॥ కురువేరుచప్పరములో। హరువేర్పడ లఘులయమున నలఘురియమునన్
తెలుఁ గొప్పఁగట్టుదడులన్। మెఱుఁగులు మిఱుమిట్లు గొలుప మించినలీలన్॥ 78

గీ॥ తీర్చిదిద్దినకస్తూరి తిన్నెమీఁద
దసరుపుప్పొడినడుమ నెత్తమ్మిమిద్దె
గద్దియ యమర్చి యందుపై ముద్దు గుల్కు
లేఁతచిగురాకుపటముపై లీల దనర॥ 79

క॥ నిస్తులగతిఁ గస్తూరిన్। శిస్తుగ వలఱేనిరూపు శృంగారకళల్
విస్తరిల వ్రాసి యిందుశి। లాస్తరణముమీఁద నునిచి యంచితగరిమన్॥ 80

గీ॥ సోమశరచాపబాణవసంతవిధుమ
ధువ్రతమరాళకోకిలాదుల యథార్థ
గతి లిఖింపుచుఁ బరివారయుతము గాఁగ
నతనిసతి యైనరతిదేవి నట్ల వ్రాసి॥ 81

సీ॥ చేతఃపరస్థితిఁ జెలఁగునవనంగుని, ధ్యానంబు చేయ శక్యంబె నిన్ను
పరిపూర్ణుఁడవు జగత్ప్రతతుల నెట్లు ని, న్నావహింపఁగఁ జేయ నలవి యగునె

అనుపమానందమహాంబుధి వైననీ, కర్ఘ్యాభిషేకంబు లనఁ దరంగలె
సుమనఃప్రవృద్ధికృత్య మనస్వీమాధవ, హృద్య నీ కెట్లు నైవేద్య మనుట
గీ॥ సకలలోకాద్భుతప్రద సహజనిబిడ
తేజ! నీ కెట్లొసంగ నీరాజనంబు
చేకొనుము నేర్చినట్ల మా సేయుభక్తి
భక్తిసులభుఁడ వౌదు వవ్యక్తరూప॥ 82

క॥ అబలామణి నేఁచను మీ। ప్రబలుం డగురఘునృపాలుపట్టి న్భవదీ
యబలోద్ధతి సుమశరతతి। నిబిడంబుగ వేయు మీవు నిపుణత వెలయన్॥ 83
గీ॥ బాపు! జల్వలయే వెడ బాపుకోపుఁ
జూపు నీరూపు కతిసుబ్బుసొగసు మాల
నలరు నీతూపు బలువిల్లు నలరురూపు
నీవు సరవీరుఁ డెవ్వఁ డీలోకమునను॥ 84

వ॥ అని వినుతింపుచు॥ 85

క॥ విమలకనులకువలయగం। ధమాల్యముఖవస్తువులను నైవేద్యమ్ముగ్
క్రమమునఁ బదియాఱుపచా। రములన్ రతిపతి కొనర్చి రమణులు మఱియున్॥ 86

సీ॥ వందనం బిదె రమానందన! గైకొమ్ము, దండంబు పుష్పకోదండ! నీకు
వినుతి నీకొనరింతు వనజబాణ! పరాకు, సాష్టాంగ మయ్య విహంగసైన్య
ఇదె నమస్కార మోహిమభానునల్లుఁడ!, శరణార్థి నీకు మత్స్యధ్వజాంక
జోహారు నీకు మంజులకీరతుఃఖార, చిన్ని వెన్నెల నీకుఁ జిత్తజన్మ
గీ॥ అల్లనేరేళ్లు నీకు మహానుభావ
మ్రొక్కులివె నీకు సూనసమ్యక్కృపాణ
ఇదిగొ దోసిలి నీకు లోకైకవీర?
యోమురారికుమార! ప్రణామ మయ్య॥ 87

క॥ సదనారతసద్గుణమణి। సదనా శరదంబుజాత సన్నిభవదనా
మదనాగయానఁ బ్రోవుము। మదనా! నవకుందబృంద మంజులరదనా॥ 88
క॥ అజునిన్ రక్షితసుజన। వ్రజునిన్ హంసకవిరాజ పదనీరజునిన్
రజనీకరనిభముఖికిన్। నిజనాథునిఁ జేయు వేగ నేర్పు చెలంగన్॥ 89

చ॥ అని వనజాస్త్రుఁ వేఁడుకొని యవ్వని జవ్వని నిల్వ రా దటం
చును జలజాయతాక్షులు ప్రసూనశరుం డిదె వెంబడించెఁ జా
యనువుగ మేడ కేగ వలె నంచుఁ దలంచి నృపాలకన్యఁ దో 90
డ్కొని చన వచ్చె నయ్యువతి కోరిక లీక లెత్త నత్తఱిన్॥

మత్తకోకిల॥ వచ్చి యచ్చపలాక్షి పూవిలు వాలితూపుల వేగుచున్
మచ్చిక న్గల గన్నరానుతు మానసంబున నెంచుచున్
మెచ్చు వచ్చు కడానిబంగరు మేలిమంచము మీఁదటన్
హెచ్చుపువ్వులపాన్పుపైఁ బడి యెంతయున్ విరహార్తితోన్॥ 91

క॥ పలువిధములఁ బొరలుచుఁ గడు। వెలవెలనై యొఱలుఁ జెంది వెలఁదుల్ శిశిరన్
గలకంఠకంఠి ద్విజరా। కలు గోరుచు నుండె నజాని కత వినుటన్నై॥ 92

ఉ॥ ఆతరువాత బళ్ళిమనగాగ్రతరుప్రజఘర్షణోత్థిత
ద్యోతదవాగ్నికీలసహితోష్ణమరున్మహారిద్ధమానచం
డాతప మైన గ్రీష్మఋతు వద్భుతమై కనుపట్టె భూతసం
ఘాతనితాంతతాపఘన ఘర్మకణోద్భవహేతుభూతమై॥ 93

సీ॥ ఎండెండ నసలందు నెండి మీ ల్మెదలంగ, భ్రమింగి మెడ ల్వంబు కొంగగుంపు
నెండమావులు గాంచి మెండు నీ రని యెంచి, క్రేళ్లు దాఁటుచుఁ బోఱులేళ్ళసారు
కార్యత్వరలఁ జెంది కడుక్రాంతిమైఁ గుంది, వనులనీడల నుండు జనులపిండు
చండాతపనితాంత సంతాపబహుతాంత, కాంతారజమునోజ కుంతరాజి
గీ॥ కించిదవశిష్టసలిలపంకీభవత్త
టాకనద్యావళులు గల్గి లోకమెల్లఁ
దల్లడిల్లఁ జొచ్చెఁ జండమార్తాండకిరణ
తండతండంబు లొండొండ మెండుకొనఁగ॥ 94

ఉ॥ ఖండసుధాంశుభృన్నిటల కాండభుజోజ్వలకేలికావళుల్
ప్రచండతఁ గార్యవహ్ని యయి జంట గణంగి వెలింగె నౌకొ మా
ర్తాండకరాళితో నన దురంతనిరంతరతాప మెంతయున్
మెండయి సర్వజంతువుల మేనుల్ల జేరఁ దొణంగె నత్తఱిన్॥ 95

సీ॥ పాటలావనిజాత ఝాటలాలితపుష్ప, కోటిలావణ్యంబు గొమరుమీఱ
చందనాచలవాయు చందనాంచితగతి, స్యందనాధికలీల డిందుపడియె
కాకలీరమణీయ కోకిలాతివచోర, సైకలాంఛనరీతి సన్నగించె
అంగనాజనకృతా లింగనానందప్ర, సంగనాధికవృత్తి జనులకొదవె

గీ॥ సర్వజనహస్తవిన్యస్త చాల్యమాన
తాళవృంతానిలస్ఫూర్తి ధరణి మించె
నతులయత్నప్రకల్పిత వితతమార్గ
సతతపానీయశాలికా స్థితి దనర్చె॥ 96

ఉ॥ ఇంకదొణంగెపంకజస మేధితసారసరోవరాళికా
లంకష మౌనదీతతి జలస్థితి శూన్యతఁ జెందె డిందె మీ
నాంకపటుప్రతాపము దవాగ్ని సముద్గతనూత్న నూత్నధూ
మాంబరముల్ విరాజిలె దిగంతములన్ బ్రతివాసరంబులన్॥ 97

సీ॥ అంబుసంసిక్తాంబ రాంచలమ్ములు గేలఁ, బొసగించి పలుమాఱు విసరువారు
ప్రత్యూషహృతనూత్న భాండశీతాంబువు, లేలారజము నించి గ్రోలువారు
బహురుద్ధతోష్ణవ త్పశ్చిమానిలధాటి, సైఁచక నీడకై జరుగువారు
గృహకృత్యకరణసం క్రీడలఁ బ్రాల్మాలి, యెంతయు నిద్దుర నెనయువారు

గీ॥ లలితజంభలఫలరస మిళితకలిత
శైత్యజలతక్ర గుడజల సరసనారి
కేరమధురాసవమ్ములు సారెసారె
ద్రావువా రైరి జను లాని దాఘవేళ॥ 98

శా॥ దూరాపాస్తనిచోళయౌవతముఖ ద్యోతోష్ణవృద్ధిక్రియా
ధౌరంధర్యయుతం బపేతరతిరాడ్దర్పంబు గాఢాంధువా
ర్ధారాకర్షిజనాహృతామితమహో రజ్జుప్రతానంబు త
ద్ఘోరగ్రీష్మఋతుప్రభావగతి సంక్షోభింపఁ జేసెన్ ధరన్॥ 99

సీ॥ ఇవి స్వర్ధునీమరు త్ప్రవిధూతవలమాన, విమలడిండీరఖండము లనంగ
ఇవి సురద్రుమగళ త్ప్రవిమలాంబరదృశ్య, మానప్రసూనసంపద లనంగ

ఇవి సరోజాతబాంధవసైనికవ్రాత, ధృతసితచ్ఛత్రసంతతు లనంగ
ఇవి మరుద్భామినీ హేలాకతనులిప్త, సాంద్రచందనసితచ్ఛాయ లనఁగ

గీ॥ చదల విలసిల్లె దావాగ్ని సదృశతపన
పటుతరాతపనిగ్గళత్ప్రబలశాల్మ
లీఫలోత్థితతూలముల్ దిక్తటముల
నమ్మహాగ్రీష్మవేళ నత్యంతలీల॥ 100

శా॥ ఆపాతాళనిఖాతజాతజలధారాపూర్ణసద్దీర్ఘికా
కూపవ్రాతములందుఁ గ్రుంకు లిడి తత్కూలస్థితోద్యానకు
ల్యాపార్శ్వస్థితకుంజపుంజముల నేలాడోలికాపాలికన్
స్త్రీపుంసవ్రజ మెంతయున్ మెలఁగెఁ దద్గ్రీష్మాతిభీష్మవ్యథన్॥ 101

ఉ॥ చలువలు గట్టి చల్వ వెదఁజల్లునుశీరపుతాళవృంతపుం
జలన మెలర్ప మేనినునుచందనపుం నెఱపూఁత యొప్పఁగా
నలరిన ప్రేమ వెన్నెలబయళ్ల జెలంగుచు రట్టివేసవిన్
మలయపుగాలిరాకలకు మానసముల్ చిగురొత్త దంపతుల్॥ 102

చ॥ అడుగడుగంద వేఁడిసుము లంటిన నుత్పతదంఘ్రియుగ్ములై
తడఁబడి మండువేసవిఁ బథంబుల నీరము లేమిమై శ్రమం
బడఁగ మహాగ్రహారములకై చనుదెంచి గృహస్థవర్యు లిం
పడరఁగ భోజనంబు లిడ నర్థి నుతింపఁ దొడంగి రధ్వగుల్॥ 103

గీ॥ అనిదాఘరీతి యానిదాఘస్ఫూర్తి
ప్రబలతరమహాతపంబు నిఖిల
భువనపంకహరణ భూరివిస్ఫురణచే
జగతి వెలసినట్టి సమయమునను॥ 104

చ॥ తొలకరిబృంహితంబు లనఁదోరపుగర్జితముల్ దిగంతరం
బుల వెలయన్ దదీయమణిభూషణనూత్నధగద్ధగద్యుతుల్
వొలిచె ననంగఁ గ్రొత్తమెఱుపు ల్తిపురల్ గొన నంతనంతటన్
ధొలకరిమబ్బు లెంతయును దోఁచె నిదాఘమహోష్ణహారులై॥ 105

సీ॥ బలరేఖ లంబరస్థలి విశాలము లయ్యె, కసరుమఁ దెమ్మరల్ విసరఁ జొచ్చె
నటియించె నిఖిలశిఖావళి మయూరములు, శీతలంబై దావశిఖి యడంగెఁ
బ్రతిసంధ్యయందు నంబరము కెంపు వహించెఁ, గుటజవ్రజంబు వికస్ఫుటత మించె
పరగఁ దూరిగ లాకసమున నాడఁ ద్రోడంగె, జాతకంబులు చాల సంతసించె

గీ॥ అంబుజంబులడంబంబు లవనిఁ దఱిగె
హంసపంఘుంబులకు దైన్య మతిశయించె
నుత్తరంబున బలుమించు లుద్భవించె
నంచితం బగునట్టి వర్షాగమమున॥ 106

చ॥ పలపలఁ దొల్తఁదొల్త నొకపాటిగ మూటికి నేటవాలుగా
జలకణముల్ దిగుడ్చుచు వెసం జడిపై జడి సందడించఁగా
జలధరపంక్తి దార్కొనుచుఁ జండకరుం గన నీక దట్టమై
వెలసి మహాంబుధారల దివిన్ భువి నేకము సేసె నత్తఱిన్॥ 107

శా॥ ఖావిద్యోతితలోకమై హరిరవ వ్యాకీర్ణమై రాజహం
సావశ్యోత్సుకతాప్రపంచాయుఘనరేఖాన్వితమై పారస
ప్రావీణ్యాకరమై శరత్ప్రకటమై ప్రస్ఫీతఖద్యోతమై
ప్రావృట్కాలము వొల్చె నయ్యెడ శరచ్ఛ్రీవృద్ధిన్ విజృంభింపుచున్॥ 108

గీ॥ అంబరేందిర నిటలంబునందుఁ దాల్చు
కుంకుమపురేఖయో యనఁ గొమరు మీఱె
నింద్రచాపారుణాభ తదీయరజము
రాలె నని నింద్రగోపాళి రహి వహించె॥ 109

చ॥ సారసజాతనూతనవిశాలవిలాస మెలర్చ హంసరా
జీరమణీయసంగతి విచిత్రత గాంచఁ బ్రకాశపాండుర
శ్రీ రహి గుల్క సత్కవులు చెన్నలరంగ ధరాతలంబునన్
శారదలీల లెంతయును శారదలీలఁ జెలంగె నత్తఱిన్॥ 110

చ॥ విలసితపుండరీకము లవేలరథాంగవిహారముల్ మహో
జ్జ్వలఘనరాజహంసము లసంఖ్యశిలీముఖముల్ సువాహినీ

కలితవిచిత్రసంస్థితు లగణ్యవనప్రతిభల్ వెలంగఁగా
వెలసె సరోవరాళి పృథివిన్ బురరీతి శరద్దినంబునన్॥ 111

శారదవ్రజరజశ్శారదోపమపాండ్య, శారదద్యుతిమిళ త్స్వరపథము
సారసాళివిశాల సారసాళివిహార, సారసారవహారి జలపథంబు
శాలివన్యాధిక్య శాలివన్యాయుక్తి, శాలిపల్లత్కర సముదయంబు
లసమానధవళచే లసమానతమహిన్నశై, లసమాన సైకతో ల్లసితతటిని

గీ॥ సకలనృపజైత్ర యాత్రావ సరవిజృంభ
మాణచతురంగబలకీర్ణ మార్గ మగుచు
ధరణిజనసంతతానంద కరనిరూఢి
వెలసె శారదవేళ బల్ విశదలీల॥ 112

సారసలక్షణాధికసుశస్థితి మీఱ మరుత్కుమారస
చారచరద్ధళామిత విశాలపలాశతతిన్ ధరాజ స
తారమణీయమై ఖరి బుధస్తవనీయహరీశజృంభణన్
శారదలీల రామకథ చందమునన్ దనర్చారె నిద్ధరన్॥ 113

గీ॥ కలితగాంగేయమహిమంబు కలశజోద
యప్రభావము పాండుపక్షాధికతయు
ధార్తరాష్ట్రాభివృద్ధియుఁ దనర జగతి
శరదృతువు మించె భారత సమితి గాంచి॥ 114

వ॥ తదనంతరకథాసంవిధానం బెట్టిదనిన॥ 115

పారావారగభీర భీరహితశుం భత్సేన సేనాన్వయ
కారీ ప్రస్ఫుటతేజ తేజితశరా ఘవ్యాహతారీశ యీ
శోరుప్రస్తవనీయ సంపదభిరా మోద్యద్యశోభాస్వరా
శ్రీరామారమణీవిలాసయుత నూజేటీపురాధీశ్వరా॥ 116

ధారాధరతారాకర। సారమహీరుహసుధాంశు జలజాప్తసుతో
దారనిరంతరవితరణ। సారాశాగ్రగణ్య సంచితపుణ్యా॥ 117

సుగంధి వృత్తం

పద్మనాయకాన్వయాబ్ధి పార్వికాంబుజాహితా
పద్మసంభవోపమాన భవ్యధీసమన్వితా
పద్మనేత్రపాదపద్మ భక్తియుక్తసువ్రతా
పద్మలోచనానితాంత భావితాంగదైవతా॥ ౧౧౪

గద్య.

ఇతి శ్రీమదఖండ సచ్చిదానంద కాశీపతి సద్గురుస్వామిచరణారవింద సేవా
సమాగతస్వ స్వరూపజ్ఞాన రాజయోగసామ్రాజ్య లక్ష్మీధురంధరజ్ఞాన
ప్రసూనాంబికా కాళహస్తీశ్వర కరుణాకటాక్షవీక్షణసంప్రాప్త
సారసాహితీబంధుర బంధురంజనకరచరిత్ర పాకనాటికుల
పవిత్ర ధూర్జటిపౌత్రకాళయామాత్య లక్ష్మమాం
బికా కుమార కుమారధూర్జటిప్రణీతంబైన
యిందుమతీ పరిణయంబను మహా
ప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.

